# మనవి

కాంగ్రెసుకు షష్టిపూర్తి - కాంగ్రెసు భారతస్వాతంత్ర్యమే లక్ష్యముగా అరువది సంవత్సరములనుండి సాగించిన స్వరాజ్యసమర సంక్షిప్తచరిత్రను, కార్మిక కర్షకప్రజారాజ్యస్థాపనమే ఆశయంగా దేశసౌభాగ్యమునకై నిరంతరకృషి సాగిస్తున్న ఏకైక భారతజాతీయసంస్థ సంక్షిప్త చరిత్రను కాంగ్రెసు చరిత్రకారుడు, వర్కింగ్ కమిటీ సభ్యుడు మన డాక్టర్ పట్టాభిగారు వ్రాసియున్నారు. దీనిని బొంబాయి రాష్ట్రీయ కాంగ్రెసుసంఘంవారు ఏ. ఐ. సి. సి. మహాసభా సందర్భమున ముద్రించియున్నారు.

జాతీయవిజ్ఞానమందిర ఆశయసిద్ధికి కాంగ్రెసు షష్టిపూర్తి ముద్రణము మొదటిమెట్టు కాగలదను విశ్వాసముతో ఇంతవరకు కొందరు దీనిని ప్రచురించి ఉన్నప్పటికిని, మేమున్ను ఆంధ్రులకు అందించుచున్నాము. ఈ తొలి కుసుమం పిమ్మటనే నిర్మాణకార్యక్రమం రాగలదు.

తమ గ్రంథానువాదమునకు అనుమతినిచ్చి ప్రోత్సాహమొసగిన డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారికి మా కృతజ్ఞత.

మదరాసు,
22-12-45

ప్రధాన సంపాదకుడు.

# కాంగ్రెసు ప్రచురణల బోర్డు

కాంగ్రెసువారి అభిప్రాయాలు ఎప్పటికప్పుడు ప్రజలకు అందచేయబడటంలేదనే లోపం ఈ మధ్య కొంతకాలమునుంచికూడా బాగా కనిపిస్తూంది. ప్రముఖ కాంగ్రెసు నాయకులు నిరంతరం ప్రచారం చేస్తూనే ఉన్నారుగాని, మధ్యమధ్య వారు దీర్ఘకాల నిర్బంధాలకు గురిఅయి ప్రజలమధ్యనుండి తొలగింపబడుతూఉండడటంవలన వారికి ప్రచారంచేసే అవకాశం లేకపోతూంది. ముఖ్యంగా అలాంటి సమయాల్లో కాంగ్రెసు యొక్క భావములను ప్రచారంచేయడానికి, తీవ్రకాంగ్రెసు రాజకీయాలతో సంబంధములేని సంస్థ ఒకటి ఉండటము అవసరమని కాంగ్రెసు వాదులు భావిస్తూవచ్చారు. అట్టిసంస్థను నిర్మించాలనే ఆశయంతోనే కొందరు కాంగ్రెసువాదులు 'కాంగ్రెసు ప్రచురణల బోర్డు' అనే ప్రస్తుత వ్యవస్థను స్థాపించడానికి నిశ్చయించారు. కాంగ్రెసు కార్యక్రమానికి సంబంధించిన వివిధవిషయములనుగురించి ప్రత్యేకాధికారంతో మాటలాడగల, అనుభవజ్ఞులైన రచయితలచేత విజ్ఞానప్రదములైన కరపత్రములను వ్రాయించి అందుబాటులో ఉండేవిధంగా స్వల్పధరకు ప్రకటించడం-ఈసంస్థ తలపెట్టిన ముఖ్యాశయాలలో ఒకటి. ఈఆశయ స్ఫూర్తికి ఈసంస్థ అనుభవజ్ఞులైన ప్రచారక నిపుణులతో కూడిన ఒక సంపాదక ఉపసంఘాన్ని నియమించింది.

ఈ సంస్థ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిచే రచింబడిన 'కాంగ్రెస్ షష్టిపూర్తి' (Sixty Years of Congress) అనే ఈ కరపత్రమును తన ప్రథమ ప్రచురణగా ప్రజలకు సమర్పింపగలగడం-తన అదృష్టంగా భావిస్తూంది. ఈ విషయమునుగూర్చి వ్రాయుటకు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారికి గల ప్రత్యేకార్హత నిర్వివాద

విఖ్యాతులు. ఆయన 50 సంవత్సరముల కాంగ్రెసు సమగ్రప్రమాణ చరిత్రను రచించినవారు. చాలా కాలమునుంచి ఆయన అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గసభ్యులు. రాబోవు క్రిస్మసుతో కాంగ్రెసుకు షష్టిపూర్తి అయి వజ్రోత్సవ యోగ్యత కలుగుతూంది. ఆ సందర్భమున కాంగ్రెసు ప్రచురణల సంఘమువారి ప్రస్తుత ప్రచురణకంటె యుక్తమైనది మరొకటి లభింపబోదు. ఈ సంపాదక ఉపసంఘం తన పక్షమున — బోర్డువారిపక్షమున, వ్యవధి లేకుండా కోరినప్పటికీ, అనేక ప్రముఖబాధ్యతలను నిర్వహిస్తూ ఉన్న కాలంలోనే, శ్రమ అనక ఈ గ్రంథము వ్రాసియిచ్చినందుకు వారికి తన హృదయ పూర్వకమైన, కృతజ్ఞతాభి వందనములు సమర్పిస్తూంది. వారి ఈ సహాయమును కేవలం చేయూతగా నేకాక ఆశీర్వాదముగా కూడా భావిస్తూంది.

ఈ బోర్డువారు తమ ప్రచురణలను ఇంగ్లీషు, హిందుస్థానీ (ఉభయ లిపులలోను), మరాఠీ, గుజరాతీ, కన్నడభాషలలో ప్రకటింప దలచుకొన్నారు. బోర్డుతరఫున సంపాదక ఉపసంఘంవారు దేశంలోని రచయిత లందరిని, కాంగ్రెసు కార్యక్రమములోని వివిధవిషయములను గురించి వ్రాయవలసినదిగా ప్రార్థిస్తున్నారు. రచనలు వాటిగుణములను బట్టి మాత్రమే నాణెము చేయబడతాయి అనీ, గ్రంథకర్తల పరిశ్రమ ప్రతిఫల రహితంగా స్వీకరింపబడదు అనీ రచయితలు గుర్తింపప్రార్థన. స్వామ్యములన్నీ బోర్డువారికే చెందుతాయి. కరపత్రములు పైన ఉదాహరింపడిన ఏభాషలోనైనా రచింపబడవచ్చును.

కరపత్రాలన్నీ ఒకేసైజులో క్రౌన్ అష్టపోసైజులో 32 పేజీలు ఉంటాయి.

కాంగ్రెసు భవనం<br>
బొంబాయి 4.<br>
సెప్టెంబరు 1945.



మననాయకుడు - మహాత్మా భారత భాగ్య విధాతా!

# కాంగ్రెసు షష్ఠిపూర్తి

## ౧. ప్రాదుర్భావము

భారత జాతీయ కాంగ్రెసు చరిత్రే నిజానికి ఆధునిక భారతదేశ చరిత్ర, – విదేశీయ దాస్యశృంఖలములనుండి విముక్తి పొందుటకుగాను సాగింపబడుతున్న స్వాతంత్ర్య సమరముయొక్క చరిత్ర. స్వపరిపాలన గల దేశాలలో కూడ ఆయాదేశ ప్రజలయందలి చైతన్యమే వారి స్వాతంత్ర్యమునకు రక్ష. ఆ ప్రజా చైతన్యాన్ని వెల్లడిచేయడానికి ఉపకరించే సాధనము – కొంచెము మొరటుగా చెప్పవలెనంటే, – 'ఆందోళన'. ఈ ఆందోళన ప్రాథమికదశలో 'వినతులు, విజ్ఞాపనలు, విరుద్ధభావ ప్రకటనలు' అనే వికాసత్రయముద్వారా వ్యక్తమవుతుంది. 'ప్రకటన, ప్రబోధము, ప్రచారము' అనే ప్రారంభత్రయం ఈ ఆందోళనను ఒక నియమిత పరిమాణంలో వ్యాపింపజేయడానికి సహాయపడతాయి. అంతేకాదు, వీటిమూలమున నాయకులు ఆ ప్రజాచైతన్యముయొక్క నాడిని పరీక్షించి, ఆ నాడీ విచలనానికి మూలకారణమైన ప్రధాన తత్త్వాన్ని అవగాహన చేసుకొని, తగిన చికిత్సా విధానమును నిర్ణయించుకొని కార్యక్రమానికి పూనుకుంటారు. ఒకనాటి ప్రజాందోళనే

ఆ కాలపు రాజకీయాలుగా పరిణామం చెందుతాయి. ఒక నాటి రాజకీయాలే మరునాటికి చరిత్రగా పరిణమిస్తాయి. ఆంగ్లో-ఇండియను ప్రభుత్వాలూ, రాజ్యాంగ నిపుణులూ కాంగ్రెసును 'ఆందోళనాత్మక సంస్థ' అని, 'రాజద్రోహ కూటమి' అని అనేకమార్లు, అనేకరీతుల విమర్శించారు. దీనికి కాంగ్రెసును — 1885 లో నాటి రాజప్రతినిధి డఫ్రిన్ ప్రభువుయొక్క ప్రోత్సాహముతో ఏ. ఓ. హ్యూము అనే రిటైర్డు ఐ.సి.యస్. ఉద్యోగి నిమిత్తకారకుడుగా — ప్రాదుర్భావించినదే అయినా ఒకవిధంగా పై విమర్శలకు అర్థమైనదే అనికూడా చెప్పవచ్చును.

కాంగ్రెసు సంస్థకు పునాది వేయబడుటకు పూర్వం దేశముయొక్క పరిస్థితిని, వాతావరణాన్ని గురించి ఇక్కడ కొంచెం తెలుసుకోవడం అవసరం. తూర్పు ఇండియా కంపెనీవారు నాటికి నూరు సంవత్సరాలనుంచి వారి వాణిజ్య, రాజకీయ చాతుర్యములవల్ల భారతదేశంలో సువిశాలములైన రాజ్యఖండాలను సంపాదించి ప్రభుత్వాధికారాలను చెలాయించడం ఆరంభించారు. 1772 తరువాత ఈకంపెనీ వారి రాజ్యపాలనా విధానమును అప్పుడప్పుడు బ్రిటిషు పార్లమెంటువారు పరిశీలిస్తూ, లోటుపాట్లను సవరించడమారంభించారు. బర్కు, షెరిడన్, ఫాక్సు మొదలైన వారు భారతదేశంలో ఈ కంపెనీ ఉద్యోగస్థుల దుష్ప్రవర్తననుగూర్చి తమ దేశీయులకు చెపుతూఉండేవారు. భారతదేశానికి ప్రథమ రాజప్రతినిధిగా పనిచేసిన వారన్ హేస్టింగ్సు ప్రభువులసభలో దోషిగా విచారింపబడ్డాడు.

కంపెనీ ఉద్యోగులు భారతదేశంలో రాజ్యవిస్తరణకోసం యత్నించకూడదని ఉత్తరువు చేయబడింది. కాని కాల ప్రవాహం అడ్డగింపరానిది. 1773 లో రెగ్యులేటింగు చట్టము చేయబడింది. 1884 లో కంపెనీ డైరెక్టరుల సభపైన, గవర్నరు జనరలుపైనకూడా అధికారం చెలాయించగల బోర్డు ఆఫ్ కంట్రోలు అనే మరొకసంఘం నియమింపబడింది. భారతదేశంలో అప్పటికి సంపాదింపబడిన రాజ్యము యొక్క పరిపాలనా బాధ్యతను బ్రిటిషుపార్లమెంటు తన హస్తగతం చేసుకుంది. కంపెనీయొక్క హక్కుల పత్రం పునరుజ్జీవితం చేయబడినప్పుడల్లా - అంటే 1793, 1813, 1833, 1853 సంవత్సరాలలో, కంపెనీవారి పరిపాలన ఆ విధంగా పరిశీలింప బడింది. 1833 వ సంవత్సరపు హక్కుల పత్ర శాసనము (Charter Act)లో ఒక ముఖ్యమైన విషయం ఉంది:- "పైన చెప్పబడిన దేశములో నివసించే ఏవ్యక్తీ, చక్రవర్తియొక్క ప్రజలలో ఒకడుగా సహజమైన జన్మకలిగిన ఏ వ్యక్తీ, మత, రాష్ట్ర, వర్గ, వర్ణ విభేదములలో ఏ ఒక్కదాని కారణముగాగాని, లేక వీని అన్నింటివలనగాని, పై కంపెనీలో ఏ నౌకరీకిగాని, ఉద్యోగానికిగాని, పదవికిగాని అనర్హుడుగా ఎంచబడరాదు"—అని అందులో స్పష్టంగా వివరింపబడిఉంది. అంతేకాదు - "భారతదేశంలో దొరలజాతి అనేది ఏదీ ఉండకూడదు. జాతిమత విభేదాలు అర్హతానర్హతలకు కారణాలు కారాదు. చక్రవర్తి ప్రజలలో భారతీయునిగాని, ఆంగ్లేయునిగాని, లేక మిశ్రసంతతి వానినిగాని, - అతడు అవసరములైన ఇతర అర్హతలను

గలిగియున్నచో, ఒడంబడికలతో కూడిన నౌకరీలకుగాని, లేని ఉద్యోగములకుగాని - అనర్హుడు అని డైరెక్టరుల సభ వారు త్రోసివేయరాదు.'' ఇట్లు 1833 వ సంవత్సరపు హక్కుల పత్రశాసనంలో వివరంగా చెప్పబడిఉంది. ఈ శాసనమే కంపెనీవారి భారతదేశంలో వర్తకంచేసుకొనే హక్కును రద్దుచేసింది. నాటితో కంపెనీ వర్తకసంస్థగా పనిచేయడం మానివేసి పూర్తిగా పరిపాలక సంఘంగా పరిణమించింది. ఈ సమయంలోనే, విద్య ఆంగ్లభాషలో నేర్పబడవలెనా, లేక దేశీయ భాషలలో నేర్పబడ వలెనా అనే సమస్య ఒకటి బయలుదేరింది. చివరికి ఆంగ్ల భాషలోనే విద్యనేర్పాలి అని నిర్ణయించారు. ఈ నిర్ణయానికి కారకులయిన వారిలో మెకాలే, రాజారామమోహన రాయి ముఖ్యులు.

భారతదేశమందలి వివిధభాగాలు ఎలా ఆక్రమింప బడినవో - ఆవివరాలలోనికి పోవడం ప్రస్తుతం అనవసరం. ఇక్కడ ఒక్క విషయం మాత్రం చెప్పాలి. 1833-1853 సంవత్సరాల నడుమ చివరకు పంజాబు, సింధురాష్ట్రములు కూడా జయింపబడి నేడు 11 రాష్ట్రాలుగా విభజింపబడి యున్న బ్రిటిషు ఇండియా, - తక్కిన 562 సంస్థాన సీమల నుండి వేరుపరచబడింది.

పుత్రులులేని సంస్థానాధీశు డెవడైన చనిపోగానే ఆయన భార్యకు దత్తత చేసుకొనే హక్కులేదని ఆ సంస్థా నాన్ని స్వాధీనంచేసుకునే డల్హౌసీ ప్రభువుయొక్క సంస్థానా క్రమణ ప్రణాళిక సంస్థానాధిపతులలో చాలామందికి అసం

తృప్తిని, అసహ్యభావాన్ని కలిగించింది. సిపాయిలుకూడా వారితో ఏకీభవించారు. తత్ఫలితమే సిపాయిల కలహం అని పిలువబడే ప్రథమభారత స్వాతంత్ర్యసమరం. నిజానికి అది విదేశీయ పారతంత్ర్యమునుండి భారతదేశానికి విముక్తి సంపాదించడానికై చేయబడిన ప్రబల సాయుధప్రయత్నం. ఈ విప్లవం విఫలంకాగానే ఆంగ్లేయులు జాగరూకులై భారతీయులలో తమ విజ్ఞానాన్ని, తమ నాగరకతను వ్యాపింపచేయడం చాలా అవసరమని గ్రహించారు. ఏదో విధంగా భారతీయుల ప్రేమనో విశ్వాసాన్నో కృతజ్ఞతా భావాన్నో సంపాదించకుండా తామీదేశాన్ని పాలించడం అసాధ్యం అనే విషయం వారికి స్పష్టంగా అర్థమయి పోయింది. అందుకే వారు కష్టసాధ్యమయినదని తెలుసు కొన్నప్పటికి విడువకుండా - వారి జీవిత విధానాలను, వారి దృక్పథాలను, వారి ఆదర్శాలను, భారతీయుల మనుస్సుల కెక్కించడానికి పూనుకున్నారు. విశ్వవిద్యాలయాలను, కళా శాలలను స్థాపించి, విద్యావిధానంలో ఆంగ్లభాషాభ్యాసా నికీ, ఆంగ్లకవిత్వానికీ, ఆంగ్లనాటకాలకూ, ఆంగ్లనవలలకు, ఆంగ్ల చరిత్రలకు, ఆంగ్లన్యాయ శాస్త్రానికీ, ఆంగ్లధర్మసూత్రా లకు ప్రాధాన్యం ఇవ్వడంవల్లనే ఈఆశయం సఫలంకావాలి. అనతికాలంలోనే భారతీయులు ఈ విధంగా బాగా తరిబీ యతు పొందటంవలన ఆంగ్లభాషా పాండిత్యముతోకూడిన వృత్తి విద్యాశాలలలోకూడా వారికి ప్రవేశం లభించింది. వాటిలోకూడా నిపుణతను సంపాదించి వారు, తమకు అక్కడక్కడ స్వల్పంగా ప్రసాదింపబడుతూన్న ఉన్నతో

ద్యోగాలకోసము, పదవులకోసము శాశ్వతంగా బ్రిటిషు వారిని ఆశ్రయించుకొని జీవింపవలసినవారు అయారు. విప్లవానంతరం ఒక్క సంవత్సరంలోనే (1858 లో) కలకత్తా, బొంబాయి, మదరాసు నగరాలలో విశ్వవిద్యాలయాలు స్థాపింపబడ్డాయి. 1861 లో ఉన్నత న్యాయస్థానాలు, శాసనసభలు ప్రతిష్ఠింపబడినాయి. భారతీయ దాస్య జీవనాన్ని పాలుబోసి పెంచుతూన్న కళాశాలలు, న్యాయస్థానాలు, శాసనసభలు అనే ఈ మూడు బ్రిటిషు సంస్థలు, తదుపరి 50 సంవత్సరములకు 1921 లో భారత సత్యాగ్రహులదాడికి గురియయి, భారతీయులందరు బహిష్కరింపవలసిన సంస్థలుగా ఎట్లు ప్రకటింపబడినది – తెలుసుకొనవలసిన విషయము. దేశంలో విద్యావ్యాప్తి జరిగిన కొలది దానితో పాటు రాజకీయ చైతన్యంకూడా వృద్ధికావడ మారంభించింది. తత్ఫలితంగానే 1851 లో బెంగాలులో "ఆంగ్లభారతీయ సంఘము" (British Indian Association), బొంబాయిలో దాదాభాయి నౌరోజీ, జగన్నాథ శంకర శేఠ్‌లచే స్థాపింపబడిన "బొంబాయి సమితి" ఉద్భవించినాయి. ఈ రెండవ సంఘమే తరువాత 1870–80 ప్రాంతముల స్థాపింపబడిన "ప్రాగ్భారత పరిషత్తు" (East Indian Association) కు కారణభూతమయింది. దక్షిణ భారతదేశములో మొదట వారపత్రికగా ప్రారంభింపబడి అచిరకాలములోనే దినపత్రిక అయిన 'హిందూ' భారతీయ ప్రజాభిప్రాయాలను స్పష్టంగా, దృఢంగా వెల్లడిస్తూ ఉండేది. 1876 లో బెంగాలులో "భారత పరిషత్తు"

(Indian Association) స్థాపింపబడి సురేంద్రనాథ బెనర్జీ ఆనందమోహన బోసుగారల సమర్థనాయకత్వముక్రింద పని చేయుట మారంభించింది. 1885 నాటికి దేశంలో 475 వార్తాపత్రికలు వెలసినాయి. వీటిలో చాలావరకు దేశీయ భాషలలో ప్రకటింపబడేవే. ప్రజాభిప్రాయం ఇంత విచ్చల విడిగా ప్రకటింపబడుతూ ఉండటము లిట్టను ప్రభువుయొక్క తీవ్ర ఆగ్రహానికి, నిర్బంధ విధానానికి కారణమయి, 1878 లో దేశభాషాపత్రికా శాసనము (Vernacular Press Act), ఆయుధశాసనం (Arms Act) తయారయినాయి. 1887 లో మదరాసు మహాజనసభ స్థాపింపబడింది.

ఈ రాజకీయాభివృద్ధితోపాటు సాంఘిక వాతావరణంలోకూడా గొప్పమార్పులు జరిగాయి. ముఖ్యంగా 1856 వ సంవత్సరపు భారతవితంతు పునర్వివాహశాసనము, 1872 వ సంవత్సరపు సివిల్ మారేజి శాసనము ఇందుకు నిదర్శనాలు. 1772 లో బాలికల వివాహార్హమైన కనీసపు వయస్సు 14 సంవత్సరాలుగా నియమిస్తూ శాసనం చేయించ డానికి ప్రయత్నంజరిగి విఫలమైపోయింది. ఈ సంస్కరణో ద్యములో ముఖ్యంగా పనిచేసినది; — రాజారామమోహన రాయిచేత స్థాపింపబడి కేశవచంద్రసేను, ఆనందమోహన భోసులవంటి మహనీయుల నాయకత్వమున వర్ధిల్లిన-'బ్రహ్మ సమాజము' వారు. బొంబాయిలో ఈ పని న్యాయాధిపతి రానడేచేత స్థాపింపబడిన "ప్రార్థనా సమాజము" ద్వారా జరుగుతూ ఉండేది. ఆంగ్లవిద్యా విధానఫలితంగా దేశ మంతటా ప్రజలు స్వమత త్యాగంచేసి ఇతరమతాలలో

చేరడం ప్రబలమైపోతూంది. దీనిని అరికట్టడానికి మాననీయుడైన స్వామిదయానంద సరస్వతి ''ఆర్యసమాజము''ను స్థాపించాడు.

కాని దేశంలో జరుగుతూన్న ఈ బహుముఖాభివృద్ధి వలన, నానావిధాలుగా పీడింపబడుతూన్న ప్రజలయొక్క హృదయాలలో దాగిఉన్న క్రోధభావం ఏమాత్రం శాంతింపలేదు. 1857 నాటి ఉద్యమములాంటి సాయుధవిప్లవాన్నే మళ్లీ లేవదీయాలనే ఉద్దేశంతో ముఖ్యంగా సంయుక్త రాష్ట్రాలలో బయలుదేరిన అనేక రహస్యవిప్లవ సంఘాలు దారుణకార్యక్రమానికి పూనుకున్నాయి. దేశీయుల ఈ రాజకీయాసంతృప్తిఅంతా రహస్యమార్గాలబట్టి, భయంకర రూపం దాల్చబోతూంది అనడానికి ప్రబలమైన సాక్ష్యం దొరికింది హ్యూమ్‌దొరకి. వివిధజిల్లాలలోని శిష్యులనుండి మతగురువులకు పంపబడిన రిపోర్టులు, ఇతర విధమైన సాక్ష్యము, మొత్తం 7 సంపుటాల గ్రంథానికి సరిపోయే వ్రాతమూలకమైన సాక్ష్యాధారాలు ఆయనకు లభించినాయి. దీనివలన తేలిందేమిటంటే—దేశంలో వివిధమండలాలలో రహస్యంగా ప్రమాదకరమైన విప్లవోద్యమానికి ప్రసవవేదన ఆరంభమయినది—అని. ఈ రిపోర్టులు మండలాలు, ఉపమండలాలు, తాలూకాల వారీగా విభజింపబడినాయి. నగర, పట్టణగ్రామ విభాగాలుకూడా వీటిలోనే చేరి ఉన్నాయి. ఉద్యమకార్యక్రమం ముఖ్యంగా ''అకస్మాత్తుగా తీవ్రములయిన నేరాలు చేయడం, దీనినే తరచుగా సాగించడం, ప్రజాద్రోహులయిన వ్యక్తులను హత్యచేయడం,

వడ్డీవ్యాపారాలుచేసి అంతులేకుండా ధనం సంపాదించేషాహు కార్ల ఇళ్ళలో దొంగతనాలు చేయడం, బజార్లను దోయడం-మొదలైన చర్యలతో ప్రారంభమయి, క్రమంగా సేనలను కూడా సమకూర్చుకొని, బ్రహ్మాండమయిన జాతీయ విప్లవంగా పరిణమించుట'' అని నిర్ణయింపబడింది. 1870-80 సంవత్సరముల మధ్య ఈ రహస్యసంఘాల యత్నాలను తెలుసుకొన్న ఆంగ్లపౌరులకు కనువిప్పు అయింది. తదుపరి డఫ్రిన్ ప్రభువు కాలంలో ఒక అఖిలభారత సంస్థను సృష్టించి తద్వారా భారత ప్రజాభిప్రాయ ప్రకటనకు నిరుపద్రవకరమైన ఒక మార్గాన్ని కలిపించడం చాలా అవసరమని నిశ్చయింపబడింది. ఈ అభిప్రాయమే 1885 లో ఏ. ఓ. హ్యూమ్ సత్కృషికి ఫలితంగా భారతజాతీయ కాంగ్రెసు అనుపేరుతో మూర్తీభవించింది.

## ౨. సంస్కరణల శకము

కాంగ్రెసు చరిత్రను కొన్ని శకాలుగా విభజించుకొని చదవడం ప్రయోజనకారి. 1885 నుండి 1905 వరకు వరకుగల ఆ 20 సంవత్సరముల తొలిశకము; సంస్కరణల శకమని నామకరణం చేయదగినది. ఈ శకములో భారత రాజకీయాశయములనుగూర్చి కూడా కొన్ని లక్ష్యాలు లేక పోలేదుగాని ముఖ్యంగా రాజ్యాంగ విధాన జన్యములైన తాత్కాలిక బాధల నివారణకొరకు మాత్రమే ఆకాలమున ప్రయత్నము జరిగింది. అందువలననే ఆ కాలమున జరిగిన

తీర్మానములన్నీ అట్టి తత్కాలిక బాధలను నివారింప వలసి నదిగా ప్రభుత్వాన్ని ప్రార్థించుటతోను, రాజ్యాంగ విధాన మును జాతీయ పునర్నిర్మాణానుకూలముగా సంస్కరింప వలసినదిగా కోరుటతోను సంతృప్తిపడి ఊరుకున్నాయి. ప్రజలలో ప్రబోధంకలిగించటమే ఆనాటి కార్యక్రమంలో ముఖ్యాంశం. 'ఇండియా' అనే వారపత్రిక ఒకటి కాంగ్రెసు తరఫున ఇంగ్లాండునుంచి ప్రకటించబడేది. ఆ పత్రికకు ప్రచారం విశేషంగా లేకపోయినా భారతీయ సమస్యలను గురించి ఆంగ్లేయులలో బాగానే ప్రబోధం కలుగజేసింది. 1892 నాటి సంస్కరణల శాసనముద్వారా ప్రధమతః భారతదేశంలో బొంబాయి, మద్రాసు, కలకత్తా శాసన సభలకు 6 గురు లేక 7 గురు ఎన్నుకొనబడిన సభ్యులకు స్థానం లభించడంవలన ప్రజలకు తమ ఆవేదనలను వెల్ల డించుకొనడానికి ఒకమార్గం, ఒక సావకాశం దొరికింది. వాస్తవానికి ఆ రోజులలో ఆ ఎన్నుకొనబడిన సభ్యుల హక్కులు, అధికారాలు చాలా అల్పమైనవి. ప్రభుత్వ ప్రతి నిధులను కొన్ని ప్రశ్నలడగటానికి, బడ్జెటు సమావేశపుచర్చ లలో కొన్ని హద్దులమధ్య చర్చించడానికి మాత్రమే వారికి అవకాశం ఈయబడింది; ఆ కాలపు కాంగ్రెసు తీర్మానా లన్నింటిలోను అకుంఠితమైన రాజభక్తి ప్రకటింపబడింది; బ్రిటీషు ప్రభుత్వమందు విశ్వాసంవెల్లడింపబడింది. రాజుగారి యొక్క రాణీగారియొక్క జన్మదినోత్సవ సందర్భములలో అభినందన తీర్మానాలు చేయబడినాయి; న్యాయబద్ధమైన బ్రిటిషుపరిపాలన ప్రశంసింపబడింది; ప్రజాపీడలను తొలగింప

వలసినదని ప్రార్థనలు చేయబడినాయి. దేశానికి సుపరిపాలన కావాలని మాత్రమే—నాడు వారి వాంఛ. స్వపరిపాలన అనేదిఎక్కడో మినుకుమినుకులాడే భావమాత్రంగాఉండేది. ఆంగ్ల భాషలో ఉపన్యాసాలు చెప్పటం ఆరోజులలో ఫాషన్; గడగడ మాట్లాడగలగటమే దేశభక్తికి చిహ్నంగా పరిగ ణింపబడుతూ ఉండేది. ఆ 20 సంవత్సరాలలో కాంగ్రెసు, తత్సంబంధమైన ఇతరసభలు భారతీయుల రాజకీయ ప్రతిభను, న్యాయశాస్త్ర ప్రజ్ఞను ప్రదర్శించడానికి రంగ స్థలాలుగా ఉపకరించాయి. దీనివలన దేశీయులలోని ఈప్రతి భనుప్రభుత్వంగుర్తించి అట్టి ప్రజ్ఞావంతులను పిలిచి హైకోర్టు జడ్జిపదవులను, జిల్లాజడ్జి, సబ్ జడ్జి పదవులను ప్రసాదించింది. కాని ఈ జాతీయసంస్థ ఆదిలో ఆశించినట్లు ప్రజోద్రేకం బహిర్గతం కావడానికి నిరపాయకరమైన మార్గమాత్రము గానే నిలచిపోక మార్పుచెందుతూన్నదనీ, క్రమంగా రాజద్రోహకరంగా కూడా పరిణమింప వచ్చునేమో అనీ ప్రభుత్వం అనుమానించడానికి అట్టేకాలం పట్టలేదు. ఈ విధంగా చాలా ప్రారంభదశలోనే (1888 లోనే) కాంగ్రెసు తన ప్రభుత్వానుమానపాత్రమైన జీవితాన్ని ప్రారంభిం చింది. 1898-99 నుండి 1905 వరకు రాజప్రతినిధిగా పని చేసిన కర్జను ప్రభువు ప్రజలలో నానాటికి ప్రబలుతూవున్న ఈ జాతీయభావమువలన కలుగబోయే ఆపదనుపసికట్టి, విజ్ఞా నాభివృద్ధిలోను, జాతీయభావ సమృద్ధిలోను, జాతీయ గౌరవ ప్రతిష్ఠాపనా దీక్షలోను నాడు దేశమంతటికీ నాయకమణి యైన వంగరాష్ట్రమును రెండుఖండాలుగా చేయాలని నిశ్చ

యించుకున్నాడు. వాటిలో ఒక భాగంలో మహమ్మదీయులకే ప్రాబల్యం, ప్రాముఖ్యం కలుగజేయాలని ఆయన సంకల్పం.

## 3. అధినివేశ స్వపరిపాలన శకము

ఈ వంగరాష్ట్ర విభజన కాంగ్రెసు చరిత్రలో అధినివేశ స్వపరిపాలన శకము అనే ద్వితీయాధ్యాయానికి నాంది ప్రస్తావన అయింది. 1905 అక్టోబరు 16 వ తేదీన అమలుజరుప నిశ్చయింపబడిన వంగరాష్ట్ర విభజన దేశీయులందరిలోను దాగిఉన్న తీవ్రమైన జాతీయాభిమానాన్ని చైతన్యాన్ని మేల్కొలిపింది. శక్తిమంతుడైన ఆ రాజప్రతినిధి సంకల్పించిన ఈ విభజనను,—అప్పుడప్పుడే పాదుకొనుచున్న జాతీయైక్యతను భగ్నంచేయడానికై ఆయనచేసిన ఈ యత్నమును—ఎదుర్కొనుటలో దేశమందలి రాష్ట్రాలన్నీ వంగదేశాన్ని అనుసరించాయి. ''సుపరిపాలన స్వపరిపాలనకు పర్యాయపదం కా''దనే వాక్యమందలి సత్యాన్ని కాంగ్రెసు గుర్తించింది. ఈ నినాదం బ్రిటనులో సర్ హెన్రీ బానర్ మన్ అనే మితవాద ప్రధాని నోటినుండి వెలువడింది అవటం వలన ఆరోజులలో బాగా ప్రచారంలోవుంది. 1906 లో కలకత్తాలో స్వదేశదీక్ష, విదేశవస్తు బహిష్కారము, జాతీయవిద్య, స్వరాజ్యసాధన అనే తీవ్రమైన బహుముఖోద్యమం ప్రారంభింపబడింది. ఈ ఉద్యమం—కాంగ్రెసులో విభేదాలేర్పడి మితవాదులు, అతివాదులు అనే రెండు

పత్తాలుగా చీలడానికి కారణమయింది. 1906 లో కల కత్తాలో జరిగిన కాంగ్రెసు వార్షికమహాసభలకు, తన జీవిత కాలములో మూడుమారులు కాంగ్రెసు అధ్యక్షపీఠ మలంకరించిన మహాశయుడు దాదాభాయ్ నౌరోజీ అధ్యక్షత వహించాడు. నాడు ప్రథమతః కాంగ్రెసు వాఙ్మయములో ప్రవేశపెట్టబడి, నేటివరకు భారతీయులందరినోట మారుమ్రోగుచున్న 'స్వరాజ్య'మనే పదము నౌరోజీ మహాశయుని ప్రసాదమే. ఈ నూతన ప్రణాళికతో, లంకషైరు మిల్లుగుడ్డ దేశంలోకి దిగిన తరువాత మళ్ళీ ఒక శతాబ్దానికి చేనేత పరిశ్రమ తలయెత్తింది. చేతిమగ్గాలు ఆసుకండె మగ్గాలు (Fly-shuttle looms) గా మారాయి. కాంగ్రెసు వాదులు, దేశభక్తులు అందరు లంకషైరుబట్టను బహిష్కరించి, చేనేతబట్టలనూ, భారతదేశములో తయారయిన ఉన్నిబట్టలను మాత్రమే ధరింపవలసినదిగా కోరబడ్డారు. ఈబహిష్కరణ సూత్రమే తరువాత కొలదికాలానికి ఇంకా విపులీకరింపబడి, విద్యావిధానము, రాజ్యాంగ పద్ధతుల వరకు కూడా ప్రాకింది. స్కూళ్లు, కాలేజీలుకూడా బహిష్కరింపబడ్డాయి. వాటికి ప్రతిగా జాతీయ విద్యావ్యాప్తికోసం దేశమంతటట జాతీయ విద్యాలయాలు, సంఘాలు నెలకొల్పబడ్డాయి. వంగదేశంలో సర్ గురుదాస బెనర్జీ ముందడుగు వేశాడు. శ్రీ అరవిందఘోషు, సతీశచంద్రముఖర్జీలు కూడా చాలా కృషిచేశారు. దక్షిణ భారతదేశంలో 1908 లో బాబు విపిన చంద్రపాలు మహోపన్యాసాలిస్తూ సంచారంచేసి అచంచలమైన జాతీయభావమును రేకెత్తించి

నందులకు ఫలితంగా ఆంధ్రజాతీయ విద్యాపరిషత్తు స్థాపింప బడింది. దక్షిణ భారత విద్యాసంఘానికి 20 ఏండ్లుగా విశేష సేవ చేసిన గోపాలకృష్ణ గోక్లేమహాశయుడు 1905 లో కాశీ కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఎన్నుకొన బడ్డాడు. దీనితో, అదివరకు 8 సంవత్సరాలనుంచి సామ్రాజ్య శాసన సభలలో, కర్జను ప్రశంసలకు కూడా పాత్రముమైన, ఆయన బడ్జెటు విమర్శలవలన ఆయనకు లభించిన కీర్తిలత పూలు తొడిగింది. ఒక్కమారుగా దేశమంతట నూతన చైతన్యం వెల్లివిరిసింది. మితవాదులు నిశ్శబ్దంగా పనిచేస్తున్నారు. కాంగ్రెసు క్రమంగా అతివాదుల హస్తగతమై పోతూన్న దని వారు త్వరలోనే గ్రహించారు. 1907 లో అతివాద ప్రాబల్యంగల నాగపూరు పట్టణంలో కాంగ్రెసు మహాసభ జరగాలని నిర్ణయింపబడింది. కానితీరా ఆసంవత్సరాంతాన ఈ నిర్ణయాన్ని మార్చి కాంగ్రెసును సూరత్ లో జరుప నిశ్చ యించారు. బొంబాయి న్యాయవాద సింహము, మితవాద ప్రముఖుడు అయిన సర్ ఫెరోజిషా మెహతా పరిస్థితిని స్వాధీనం చేసుకున్నాడు. లోకమాన్యుడు తిలకు - ఆ తిరోగా ములతో నేను చేతులు కలపనని నిర్భయంగా వెల్లడించి నందువలన సూరత్ సమావేశం భగ్నమై పోయింది. ఈ అంతఃకల్లోలము జరిగిన తరువాత 1908 లో అలహా బాదులో జాతీయ సమ్మేళనము అనే పేరుతో మితవాదు లందరు సమావేశమయి కాంగ్రెసు సంస్థకు ఒక మితవాద ప్రణాళికను తయారుజేశారు. 1908 లో మద్రాసులో నాటి మద్రాసు గవర్నరు సర్ ఆర్థర్ లాలీ ఔదార్యం

వలన లభించిన గుడారములలో జరిగిన కాంగ్రెసు మొదలు కొని తరువాత మళ్లీ 1915 లో బొంబాయిలో, - అప్పటికి అతిమితవాదిగా ఉంటున్న సత్యేంద్ర ప్రసన్న సింహ అధ్య క్షతను జరిగిన కాంగ్రెసు సమావేశం వరకు, మితవాద ధోరణిలోనే నడిచింది. ముఖ్యంగా, ప్రభుభక్తి పరాయణ తను వెల్లడించడం, ప్రభుత్వమును ప్రార్థించడం, బ్రిటిషు ప్రజలకు విన్నపములు చేసుకొనడం భారత ప్రభుత్వ నిరం కుశ పద్ధతులకు అసమ్మతులను తెలియపరచడం మాత్రమే నాటికార్య క్రమములోని ముఖ్యాంశాలు. ప్రభుత్వో ద్యోగులు జాతీయవాదులను రేచుకుక్కలవలె వెన్నాడడ మారంభించారు. లోకమాన్య తిలకుపైన రాజద్రోహ నేర మారోపించి 6 సంవత్సరముల శిక్ష విధించి మాండలే పంపింది ప్రభుత్వం. 1908 లో తిలకు జైలుకు పంపబడిన తరువాత జాన్ మార్లే భారతకార్యదర్శిత్వంలో మితవాదు లందరు ప్రభుత్వము పక్షానికి మొగ్గారు. సత్యేంద్రప్రసన్న సింహ గవర్నరు జెనరలు కార్యవర్గ సభ్యుడుగా నియమింప బడటము, బొంబాయి, మదరాసు గవర్నరుల కార్యవర్గ ములలో మరి యిద్దరు భారతీయ సభ్యులను నియమించడం మితవాదులు సాధించిన ప్రథమ విజయాలు. 1907 లోనే జాన్ మార్లే - భారతీయులు ఉన్నతోద్యోగాలు చేయడా నికి అసమర్థులు అని ప్రకటించాడు. ఈ రెండు సంఘటన లకు మధ్య 30-4-1908 తేదీన భారత రాజకీయాలలో ఒక విషాదకరమైన సంఘటన జరిగింది - ముజఫర్‌పూరు జిల్లాజడ్జి అయిన కింగ్స్‌ఫర్డును ఉద్దేశించి ప్రయోగింపబడిన

ఒక బాంబు కెన్నడీసతి, కెన్నడీకుమారి అను అమాయకు లైన ఇరువురు స్త్రీలపైన పడింది.

## ౪. హోంరూలు శకము

1915 వ సంవత్సరం ఫిబ్రవరి 19-వ తేదీన ప్రసిద్ధ భారత రాజకీయవేత్త, మహావిద్వాంసుడు అయిన గోపాల కృష్ణ గోఖ్లే పరమపదించాడు. ఆ సంవత్సరమే నవంబరు నెలలో సర్ ఫెరోజ్‌షా మెహతా అస్తమించాడు. 1914 జూన్ మాసాంతానికి తిలక్ విడుదల అయినాడు. 1914 ఆగస్టు 4-వ తేదీన ప్రారంభమయిన ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం త్వరలోనే జాతీయ చైతన్యమును మళ్ళీ ఒక్కమారు కదిలించింది. భారతీయుల కష్టాలను, స్వపరి పాలనా వాంఛను వ్యక్తీకరించుటలో నాటి నాయకులందరికి మార్గదర్శకుడగుటచే తిలకు మహానాయకుడైనాడు. నాటి వరకు కేవలము దివ్యజ్ఞాన సమాజముకోసమే పనిచేస్తూ, రాజకీయాలలో ఎక్కువగా పాల్గొనని బిసెంటు ఒక్క మారుగా రాజకీయ రంగంలోనికి ఉరికి హోంరూలు ఉద్యమ మును గూర్చి తీవ్రమయిన బ్రహ్మాండమైన ప్రచారం ప్రారంభించినది. 1908 నాటి అధివేశ స్వాతంత్ర్య నినాదానికి ప్రత్యామ్నాయంగా ఆ నాటినుండే హోంరూలు నినాదం వాడుకలోకి వచ్చింది. 1915, 1916, 1917 సంవత్స రాలలో బయలుదేరిన జాతీయ సంరంభములో హోంరూలు ఉద్యమం సంగ్రామనినాదాన్ని సృష్టించింది. 1916లో జరిగిన లక్నో కాంగ్రెసు మహాసభలో తిలకు మళ్లీ రాజకీయ



ఆంధ్ర కేసరి ప్రకాశం
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు

రంగంలోకి ప్రవేశించటము, మితవాదులు, అతివాదులు ఏకమయి, హోంరూలు ఉద్యమాన్ని నడిపే ఏకజాతీయ పక్షంగా ఏర్పడటము-సంభవించాయి. ఈలక్నో కాంగ్రెసే-స్వదేశి, విదేశవస్తు బహిష్కారము, జాతీయవిద్య, హోంరూలు అనే చతుస్సూత్రాలతో-తరువాత శకానికి అంకురార్పణ చేసింది. తిలకుచేత మహారాష్ట్రదేశంలోను, బిసెంటుచేత భారతదేశమంతటను చేయబడిన తీవ్రమయిన హోంరూలు ఉద్యమ ప్రచారం వలన భారతరాజకీయాలకు లభించిన పుష్టి, 1917 జూన్‌లో ప్రభుత్వం బిసెంటుకు ఉదకమండలములో నిర్బంధావాసశిక్ష విధించడానికి కారణమయింది. దీనికితోను ప్రథమప్రపంచ సంగ్రామంలో మెసపొటేమియా అలజడిని గూర్చి కామన్సు సభలో చేసిన ప్రకటనతో ఎడ్విన్ శామ్యూయల్ మాంటేగు ప్రాముఖ్యతలోనికి వచ్చాడు. కామన్సు సభాస్థలిలో మాట్లాడుతూ, భారతప్రభుత్వం ఆధునిక యుగానుగుణమైన మార్పులకు అవకాశమీయక, కర్కశంగాను, కఠోరంగాను, అభివృద్ధి నిరోధకంగాను ప్రవర్తిస్తూందని తీవ్రంగా విమర్శించాడు. దీనికి ఫలితంగా నాడు భారత కార్యదర్శిగా ఉన్న ఆస్టెన్ ఛాంబర్లేను రాజీనామా ఈయడం, ఆస్థానాన్ని మాంటేగు ఆక్రమించడం జరిగాయి. వెంటనే 1917 ఆగస్టు 20-వ తేదీన ఆయన, భారతదేశంలో క్రమంగా బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పఱుపబడుతుంది అనే ప్రసిద్ధ ప్రకటన చేశాడు. 1917 నవంబరు నెలలో మాంటేగు భారతదేశానికి వచ్చాడు. ఆయన రావటానికి పూర్వం 1917 సెప్టెంబరు

మధ్యలో అంతవరకు ఉదకమండలంలో నిర్బంధింపబడి ఉన్న బిసెంటున్నూ, ఆమె సహచరులూ విడుదలచేయబడ్డారు. మాంటేగు తన భారతదేశ సంచారంలో బాధ్యతాయుత ప్రభుత్వం అంటే బ్రిటనులో ఉన్న ప్రభుత్వం వంటిదేనని వివరించాడు. లక్నోలో కాంగ్రెసులీగులచే అంగీకరింపబడిన హిందూ–ముస్లిం ఒడంబడిక పత్రము మాంటేగూచేత కూడ ఇంచుమించుగా ఆమోదింపబడి, నూతన సంస్కరణలకు ఆధారంగా స్వీకరింపబడింది. సంస్కరణల ప్రణాళిక ఒకటి పార్లమెంటులో ప్రవేశపెట్టబడింది. దాని ముసాయిదా, (తరువాత ప్రభు బిరుదముపొందిన) మేజర్ ఛెమ్సుఫర్డుకు 1916 ఏప్రిల్‌లోనే చూపింపబడినదట. ఈతడే తరువాత లార్డుహార్డింజి అనంతరం భారత రాజప్రతినిధిగా పంపబడినాడు. అంతేకాదు; నూతన సంస్కరణలను తయారు చేయడంలో మాంటేగూకు చాలా సహాయంచేశాడు. 1919లో లార్డుసింహ భారతసహాయ కార్యదర్శిగా ఉండగా ఈ నూతన సంస్కరణలు బ్రిటిషు పార్లమెంటువారిచేత ఆమోదింపబడినాయి.

ప్రథమ ప్రపంచ సంగ్రామం 1918 నవంబరు 11 వ తేదీని అంతమయింది. మరొక ఆరు నెలలకైనా, నాటికి అమలులోఉన్న ఆర్డినెన్సుల పరిపాలన, దేశరక్షణ చట్టమూ కూడా అంతంకావాలి. కాని ప్రభుత్వానికి ఇది ఇష్టంలేదు. యుద్ధకాలమున దేశములో అమలుపరచిన తాత్కాలిక నిర్బంధ శాసనాలకు శాశ్వత స్వరూపాలను తయారు చేయడానికి ప్రభుత్వం ఒక ఉపసంఘాన్ని నియమించింది.

న్యాయాధిపతి రౌలట్ ఆ ఉపసంఘానికి అధ్యక్షుడు. ఆయన పేరుతోనే వ్యవహరింపబడుతున్న రౌలట్ బిల్లులు అనే రెండు చిత్తుచట్టాలు తయారు చేయబడినాయి. ఈ బిల్లులకు వ్యతిరేకంగా ప్రజలలోనుండి తీవ్రమైన అసమ్మతి చెల రేగింది. ఈ బిల్లుల పుణ్యమాఅని ఆధునిక భారత మహా నాయకుడు ప్రథమశః రంగస్థలంలోకి ప్రవేశించాడు. ఆయనే మోహనదాసు కర్మచంద్ర గాంధి. అంతకు పూర్వమే దక్షిణాఫ్రికాలో అఖండ విజయంగాంచిన సత్యా గ్రహసిద్ధాంత ప్రవక్త-గాంధి. బ్రహ్మచర్యము, నిస్వార్థత, సత్యము, అహింస ఆయన జీవిత మూలసూత్రాలు. దక్షి ణాఫ్రికాలో ఉండగానే ఆయన తన సర్వస్వమును త్యజించి దారిద్ర్యాన్నే వరించి 1915 లో భారతదేశానికి తిరిగి వచ్చే శాడు. గాంధి 1917 లో ప్రభుత్వాధికారులచే సమావేశ పరుపబడిన యుద్ధపరిషత్తునకు తాను హాజరై తిలకును కూడా హాజరు కావలసినదని బలవంతపెట్టాడు. కాని, ఆయన అందుకు అంగీకరించలేదు. ఆ పరిషత్సమావేశంలో ఆయన హోంరూలు ఆవశ్యకతను గురించి నొక్కి చెపుతూ, యుద్ధకృషికి సహాయముచేయవలసినదేనని వాదించాడు. స్వయంగా కొందరిని ఆయన సేనలో చేర్పించాడు. 1917 లో భారతదేశంలో, మొదటిమారుగా చాంపరానులో, చతుష్షష్టి (64) అన్యాయపు పన్నులతో నానాబాధలు పడుతున్న నీలిమందు తోటల రైతులకష్టాలను నివారించడానికిన్నీ, 1918 లో కైరాలో కర్షక సమస్యాపరిష్కారము కొరకున్నూ, బోర్సాదులో దారిదోపిడిగాంద్రబారినుండి రక్షణార

కున్నా, చివరకు 1918 లో అహమ్మదాబాదులో మిల్లుపని వాళ్ళజీతములు హెచ్చింపచేయడం కోసము నిరశనవ్రత రూపములోనూ సత్యాగ్రహాస్త్రాన్ని ప్రయోగించి చూచాడు గాంధి. ఈ పరిశోధనలు విజయవంతముగా ముగియగానే ఈ అస్త్రాన్నే రౌలట్టు బిల్లులమీద ప్రయోగింపగోరి ఆయన అఖిలభారత సత్యాగ్రహోద్యమానికి ఏర్పాట్లుచేశాడు. కొన్నిప్రదేశాలలో ప్రజలు అహింసా ప్రాముఖ్యతను పూర్తిగా గుర్తింపక పోయినందువలన దేశంలో అక్కడక్కడ దౌర్జన్యములు జరుగుటచే త్వరలోనే ఆయన ఆ ఉద్యమాన్ని విరమింపవలసి వచ్చింది.

## 6. స్వరాజ్య శకము

1919 లో కాంగ్రెసు మహాసభ అమృతసరములో జరుగవలసింది. కాని పంజాబుదేశం యుద్ధానికి సైనికు లను పంపుటలో ముఖ్యకేంద్రం అయివుండటంవల్ల అక్కడ ఈ సభ జరుగటానికి ప్రభుత్వంవారు అంగీకరించలేదు. 1919 ఏప్రిల్ నెలలో ఒకరోజున స్థానిక జిల్లామేజస్ట్రేటు డాక్టరు సత్యపాలును, డాక్టర్ కిచ్లూను తన యింటికి పిలి పించుకొని, వారిరువురిని ఎక్కడికో పంపించి వేశాడు. ఈ ఆక్రమ చర్యతో ప్రజలలో ఉద్రేకం ప్రబలి వారు పెద్ద గుంపుగా జిల్లామేజస్ట్రేటు ఇంటికి వస్తూండగా దారిలో అడ్డరోడ్డుదగ్గర మిలిటరీవారు వారిని అడ్డగించి తుపాకులు కాల్చారు. అప్పుడు చనిపోయినవారి శవాలను ప్రజలు

పెద్ద ఊరేగింపుతో తీసుకొనివెళ్లారు. ప్రజల ఉద్రేకము పట్టరానిదై తరువాత జరిగిన అనేక హత్యలకు పరశురామ ప్రీతికి కారణమయింది. దీనికి ప్రతీకారంగా 1919 ఏప్రిల్ 13 వ తేదీన డయ్యర్ సేనాని శాశ్వతకీర్తికి కారణమైన జలియన్‌వాలాబాగ్ దురంతం జరిగింది. డయ్యరు సేనాని ఆజ్ఞానుసారం జరిగిన 1600 కాల్పులకు గురి అయి 800 మంది అమాయిక ప్రజలు చనిపోయారు; 2000 మంది గాయపడ్డారు. అయినప్పటికి కాంగ్రెసు మహాసభ అమృతసరములోనే జరుపబడింది. ప్రజలుచేసిన దౌర్జన్యాన్ని నిరసిస్తూ చేయబడిన తీర్మానాన్ని ఆమోదింపచేయడానికి గాంధి చాలా కష్టపడవలసి వచ్చింది. 1915 నుండి డిటిన్యూలుగా నిర్బంధింపబడిఉన్న ఆలీసోదరులు, మౌలానా అబుల్‌కలాం ఆజాదు, 1919 డిసెంబరులో యుద్ధం ముగిసిన తరువాత 13 నెలలకు విడుదలచేయబడ్డారు. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండలో ప్రజలలో ప్రజ్వరిల్లిన కోపాగ్నికి బ్రిటిషువారు ఖిలాఫత్‌ను తిరస్కరించడం ఆజ్యధార అయింది. 1920 ఏప్రిల్ 9 వ తేదీన హిందువులు మహమ్మదీయులు అందరు ఏకముగా సహాయ నిరాకరణోద్యమం సాగించడానికి తీర్మానించారు. 1920 ఆగస్టు 1 వ తేదీన తిలకు మహాశయుడు చనిపోయాడు. గాంధి నాయకత్వం వహించాడు. 1920 సెప్టెంబరు నెలలో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక సమావేశంలో గౌరవోద్యోగాలను, బిరుదాలను, కోర్టులను, కళాశాలలను, శాసనసభలను బహిష్కరించుచు సహాయనిరాకరణోద్యమం సాగించ

డానికి తీర్మానించారు. ఈ నిర్ణయముతో స్వరాజ్యశకము అనే నూతన శకము ప్రారంభమయింది. 1920 డిసెంబరులో నాగపూరు కాంగ్రెసులో, - కాంగ్రెసు ఆదర్శం "శాంతి యుతములును, న్యాయబద్ధములునైన సాధనముల ద్వారా స్వరాజ్యమును సాధించుట"గా మార్చు చేయబడింది. నాటినుండి "స్వదేశి" అనే పదానికి - చేతితో వడకబడిన నూలుతో చేమగ్గములమీద నేయబడినగుడ్డనూ, గ్రామాలలో తయారయిన వస్తువులనూ ఉపయోగించుట,- అనే అర్థం అమలులోకి వచ్చింది. కేవలం బ్రిటిషు వస్తువులను మాత్రం బహిష్కరించటం హింసకు కారణము అవుతుంది గనుక బహిష్కరణము అంటే సర్వ విదేశవస్తు బహిష్కరణము అని అర్థం చెప్పబడింది. జాతీయవిద్య పునరుద్ధరింపబడింది. హోంరూలు ఆదర్శానికి బదులు స్వరాజ్యాదర్శం అమలులోకి వచ్చింది. కాంగ్రెసు శాసన సభలకు పోవ నిరాకరించింది. 1921 లో వేల్సు యువరాజు భారత దేశానికి వచ్చినప్పుడు ఆయనకు స్వాగతమీయరాదు అని నిర్ణయించింది. ఈ సందర్భంలో భారత దేశమంతట అసహాయోద్యమం సాగించడానికి ప్రథమప్రయత్నం జరిగింది. గాంధీజి గుజరాతులోని బార్డోలీ, ఆనంద్ తాలూకాలలో పన్నుల నిరాకరణోద్యమానికి సన్నాహాలు చేశాడు. ఆయన పథకం 1921 లో అహమ్మదాబాదు సభావేశంలో సమష్టి సత్యాగ్రహరూపేణ ఆమోదించబడింది. ఈ సమావేశ సమయంలో గాంధీకి రీడింగు ప్రభువుకు సంప్రతింపులు సాగినాయి, కాని, అవి ఫలించలేదు.

సంయుక్తరాష్ట్రాలలోని గోరక్‌పూరు జిల్లాలో చౌరీ చౌరాలో 21 మంది పోలీసువారినీ, పోలీసు అధికారినీ వారు దాగుకొని ఉన్న పోలీసు స్టేషనుతో సహా సజీవంగా కాల్చి వేశారు. వెంటనే గాంధీని పట్టుకొని ఆయనపై రాజద్రోహ నేరము మోపి విచారణ చేశారు. ఆయన తన సిద్ధాంతాను సారం విచారణలో తాను ఏమీ వాదింప ఇష్టపడలేదు. ఆయన దోషిగా నిర్ణయింపబడి ఆరు సంవత్సరములు శిక్ష విధింపబడ్డాడు. ఆయన జైలుకు వెళ్లడం సహాయ నిరాకర ణోద్యమాన్ని గూర్చిన అనేకసందేహాలకు కారణమయింది. ఈ సమస్యనుగురించి విచారించుటకు ఒక ప్రత్యేక సంఘం నియమింపబడింది. ఆ ఉపసంఘం దేశమంతట సంచారం చేసింది. చివరకు దానిలో సగముమంది శాసనసభా ప్రవే శానుకూలురుగాను, సగముమంది సహాయ నిరాకరణో ద్యమానుకూలురుగాను, తేలారు. 1923 సెప్టెంబరులో ఢిల్లీలో కాంగ్రెసు ప్రత్యేక సమావేశం జరిగింది. ఆ సభ ఒకవిధంగా అంగీకరించిన శాసనసభా ప్రవేశాన్ని 1923 లో కాకినాడ కాంగ్రెసు పూర్తిగా ఆమోదించింది. 1924 ఫిబ్రవరి 5 వ తేదీన గాంధి విడుదల అయి 1924 డిసెం బరులో బెల్గాం కాంగ్రెసుకు అధ్యక్షత వహించాడు. దేశంలో సత్యాగ్రహోద్యమాన్ని తిరిగి ప్రారంభించడానికి తగిన వాతావరణంలేదు. దేశబంధు సి. ఆర్. దాసు 1925 లో చనిపోయాడు. 1925 లోనే కాన్పూరు కాంగ్రెసు శాసనసభా ప్రవేశాన్ని ఆమోదించింది. కాని నిజానికి 1925 సెప్టెంబరులో జరిగిన పాట్నా సమావేశంలో

నిర్మాణ కార్యక్రమంలో విశ్వాసం కలవారు, శాసనసభా కార్యక్రమంలో విశ్వాసం కలవారు రెండు పక్షాలుగా విడిపోయారు. కాని రెండవ తెగవారికి కనువిప్పు కావటానికి ఎక్కువకాలం పట్టలేదు. మోతీలాల్ పండితుడే స్వయంగా - కాంగ్రెసువారు శాసనసభలకు రాజీనామా యివ్వాలని సూచించవలసి రావటం, ఆ ప్రకారం 1930 ప్రారంభంలో కాంగ్రెసువారు బయటకు వచ్చివేయటము జరిగింది. ఈ స్థితి రావటానికి పూర్వమే 1928 లో మోతీలాలు పండితుని అధ్యక్షతను జరిగిన కలకత్తా కాంగ్రెసు అధివేశ ప్రతిపత్తిని ఏర్పరచడానికి బ్రిటిషువారికి ఒక సంవత్సరం గడువునిస్తూ నోటీసు ఇచ్చింది. కాని దానివలన ఈ షత్తయినా ప్రయోజనం కలగకపోవటం, 1929 డిసెంబరు 23 వ తేదీన జరిగిన గాంధీ - ఇర్విన్ సంప్రతింపులు నిష్ఫలంకావటం జరుగగానే 1929 డిసెంబరు 31 వ తేదీన లాహోరులో స్వాతంత్ర్య పతాకం ఎగుర వేయబడింది.

## ౬. పూర్ణస్వరాజ్య శకము

ఇక్కడినుంచి సంపూర్ణస్వరాజ్య శకము ప్రారంభమైంది. వీలయినంతవరకు సామ్రాజ్యాంతర్గత భాగంగా ఉండటము, అవసరమైతే సామ్రాజ్య నుండి విడిపోవటం అని సందిగ్ధంగా వ్యాఖ్యానింపబడుతూవుండిన 'స్వరాజ్య' నినాదం వెనుకబడింది. నాటినుంచి సంశయాత్మకస్థితి తొలగిపోయింది. కాని స్వాతంత్ర్య స్థాపనకు ఒక శక్తివంతమైన

పోరాటం అవసరమయింది. ఈ పోరాటమే ఉప్పు సత్యాగ్రహోద్యమంగాను; గుజరాత్‌లోని బార్డోలీలోను, కర్నాటకంలోని శిర్సి, సిద్ధపూరు తాలుకాలలోను జరిగిన శిస్తుల నిరాకరణోద్యమంగానూ; ఇతరత్రా జరిగిన ఇట్టి మరికొన్ని చిన్నచిన్న ఉద్యమాలుగాను రూపొందింది. అటుపైన 8 మాసాలు ఉద్యమంసాగింది. ఇంతలో ఇంగ్లండులో సమావేశమైన రౌండ్ టేబిల్‌సభ పూర్తిగా విఫలమై కాంగ్రెస్ సాగిస్తూన్న ఉద్యమంవలనా, సప్రు, జయకర్, శాస్త్రివంటి మితవాద నాయకుల వత్తిడివలనా కాంగ్రెసుతో రాజీచేసుకొనటం అవసరమని బ్రిటిష్‌ప్రధాని రామ్సేమేక్డొనాల్డు నిర్ణయించుకొన్నాడు. 1931 జనవరి 26 వ తేదీన గాంధీని, అంతకు పూర్వమెప్పుడో ఒకప్పుడు కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా పనిచేసిఉన్న 26 మంది ప్రముఖ నాయకులనూ విడుదలచేసి ప్రభుత్వం వారితో సంప్రదింపులు ప్రారంభించింది. ఐనా ఒకప్రక్కన ఉద్యమమింకా సాగుతూనే వుంది. 60,000 మంది అప్పటికింకా జైళ్ళలో ఉన్నారు. ఆ సంప్రదింపుల ఫలితంగా 1931 మార్చి 15 వ తేదీన గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగింది. అది సత్యాగ్రహోద్యమానికి కలిగిన ప్రథమ విజయం. దీనివలన ఉప్పుపన్ను విషయంలో కొన్ని సౌకర్యములు చేయబడినాయి. శాంతియుతంగా పికెటింగు చేసుకొనడానికి అనుజ్ఞ ఈయబడింది; క్లిష్టకర్షక సమస్యా పరిష్కారానికి సత్యాగ్రహాస్త్రమును ఉపయోగించుకొనవచ్చునని అంగీకరింపబడింది; పన్నుల నిరాకరణోద్యమంలో వేలం వేయబడిన భూములను తిరిగి భూకామందులకు

ఇప్పించి వేయడానికి అంగీకరింపబడింది. ఇంక కాంగ్రెసు పక్షాన, పోలీసువారి దౌర్జన్యములకు వారిని విచారించాలి అనే కోరికను కాంగ్రెసు ఉపసంహరించుకొన్నది; గుజరాతులో పన్నులనిరాకరణోద్యమంలో బకాయిపడిన 20 లక్షల రూపాయిల పన్నులను ఇరసాలు చేయించడానికి ప్రయత్నిస్తానని కాంగ్రెసువాగ్దానం చేసింది. పన్నులన్నీ సక్రమంగా చెల్లింపబడినాయి. ఇల్లా పన్నులను చెల్లింపకుండా చేయడానికీ, తిరిగి ఒక్కమాటతో మళ్ళీ చెల్లింపబడేలా చేయడానికీకూడా సమర్థుడనే కీర్తి గాంధీకి లభించడంచూచి నాటి రెవిన్యూసభ్యుడైనహోట్సన్ దొరకిఅవమానకరంగాతోచింది. బ్రిటిషు ప్రభుత్వ శక్తిని నిరూపించాలని ఆయన సంకల్పం. అతివృష్టి అనావృష్టి దోషాలవలన ఆ కిత్రం సంవత్సరం రద్దుచేయబడిన పన్నులకొద్దిమొత్తం-ఒక లక్షరూపాయిలు- వసూలుచేయడానికి ఆయన మళ్ళీ ప్రభుత్వబలాన్ని ఉపయోగించాడు. దీనివలన కాంగ్రెసుస్థితి తారుమారయింది. ఒడంబడికమీద సంతకాలు అయిన తరవాత మూడు వారాలకే ఇర్విన్ ప్రభువు భారతదేశమునుండి వెళ్లిపోయాడు. ప్రభుత్వాధికార వర్గమంతా ఈ ఒడంబడికను ఎలాగైనా భగ్నం చేయ నిశ్చయించుకొనినట్లు తెలుస్తూనేఉంది. రెవిన్యూ మెంబరు హోట్సన్ బలప్రయోగంచేసి సగము విజయం సాధించాడు - అనగా రు 50,000 లు వసూలు చేయగలిగాడు. దానిపైన గాంధి 1931 డిసెంబరులో రౌండ్ టేబిల్ సమావేశానికి వెళ్ళడానికి నిరాకరించాడు. కాని బార్డోలీలో జరిగిన అన్యాయములు సక్రమంగా విచారింపబడతాయి

అని వాగ్దానంచేసి ఆయనను మళ్ళీ ఒప్పించింది ప్రభుత్వం. ఆ విచారణంతా ఒకనాటకంగా పరిణమించింది. పైగా గాంధీ ఇంకా లండనులో ఉండగానే ఇక్కడ సంయుక్త రాష్ట్రాలలో పండిత జవహరులాల్ నెహ్రూని, సరిహద్దు రాష్ట్రాలలో ఖాన్ అబ్దుల్ గఫార్ ఖానును అరెస్టు చేశారు. వంగ దేశంలో ఆర్డినెన్సు పరిపాలన ప్రారంభమయింది. గాంధీ తిరిగివచ్చి ఈ గందరగోళమంతా చూచాడు. లండనులో చూదామా మహమ్మదీయులు కేవలం మతాభిమాన పూరితమైన దృక్పథాన్ని ప్రదర్శించారు; మితవాదులు అన్ని విధాల అభివృద్ధి నిరోధకులుగా పరిణమించారు; పైగా గవర్నమెంటు హరిజనులను హిందువులనుంచి వేరుచేయడానికి చూస్తూంది. గాంధి తన ప్రాణాలనర్పించి అయినా ఈకుటుంబ విద్రోహయత్నాన్ని నిరోధిస్తానని తాను లండనులో ఉండగానే చెప్పాడు. భారత దేశానికి వచ్చినతరువాత బొంబాయిలో ఆజాదుమైదానంలో ఉపన్యసిస్తూ ఆయన తన నిశ్చయాన్ని పునరుద్ఘాటించాడు. రాజప్రతినిధిని కలుసుకోవాలని ప్రయత్నించాడుగాని వెలింగ్డను ప్రభువు దర్శనమీయ నిరాకరించాడు. మళ్ళీ శత్రుత్వం చెలరేగింది. కాంగ్రెసు మళ్ళీ సహాయ నిరాకరణము, సత్యాగ్రహమూ ప్రారంభించింది. 1932—33 సంవత్సరాలలో 1,20,000 మంది సత్యాగ్రహులు అరెస్టుచేయబడ్డారు. 1932 మార్చిలో జరిగిన రామ్సే మేక్డొనాల్డు నిర్ణయానుగుణంగా హరిజనులు హిందూ సంఘమునుండి వేరుచేయబడే యెడల, నేను ఉపవాసంచేసి చనిపోతానని తన నిశ్చయాన్ని మళ్ళీ ప్రకటించాడు; అలా

అని, ఆయన, అప్పుడు భారతమంత్రిగా ఉన్న సర్ శామ్యూల్ హోరుకు వ్రాశాడు. 1 32 సెప్టెంబరు నెలలో ఉపవాసాన్ని ప్రారంభించాడు. 6 రోజులు గడిచేటప్పటికి కమ్యూనల్ ఎవార్డు సవరణచేయబడింది. హరిజనులకు మొదట ప్రధానమంత్రి ఇచ్చిన స్థానాలకంటె ఎక్కువ స్థానాలు లభించాయి. ఆ ఒడంబడికపైన సంతకంచేసిన వారిలో అంబేద్కరుకూడా ఒకడు. కాని తరువాత ఆయన ఆ ఒడంబడికకు త్రోసిరాజన్నాడు. హరిజనుల కీయబడిన ఈ అధికమైన హక్కులవలన వంగరాష్ట్రానికి చాలా నష్టం కలిగింది. 1932—33 సంవత్సరాల్లో తీవ్రమైన, నిర్దాక్షిణ్యకరమైన నిర్బంధవిధానం సాగింది. గాంధీ జైలులో నుంచే హరిజనసేవ చేసుకొనడానికి తనకు అనుమతినీయ వలసినదని ప్రభుత్వాన్ని కోరాడు. కాని దానికి ప్రభుత్వం అనుమతింపక పోవడంవలన 1933 లో మళ్ళీ గాంధీ నిరశన వ్రతం ప్రారంభింపవలసి వచ్చింది. ఉపవాసం మధ్యలో ఆయనను విడుదలచేశారు. అందువలన గాంధీ—నేనొక సంవత్సరంవరకు రాజకీయాలలో పాల్గొనను అనీ ఆసమ యాన్ని పూర్తిగా హరిజనసేవకొరకు వినియోగింపదలచు కొన్నాను అని ప్రకటించాడు. దానికోసం ఆయన దేశ మంతటా—కొన్ని చోట్ల కాలినడకనుకూడా—సంచారంచేశాడు. 1934 ఏప్రిల్ నెలలో ఆయన సత్యాగ్రహోద్యమాన్ని విరమించడానికి నిశ్చయించాడు. 1934 మేనెలలో అ. భా. కాం. సంఘం ఆయన నిర్ణయాన్ని ఆమోదించింది. వెలిం గ్డను ప్రభువు కాంగ్రెసును అణచివేశానని సంతోషిస్తూ

1934 నవంబరులో కేంద్రశాసనసభకు ఎన్నికలు జరుపనిశ్చయించాడు. 1934 అక్టోబరులో బొంబాయిలో బాబురాజేంద్రప్రసాదు అధ్యక్షతను జరిగిన సమావేశంలో కాంగ్రెసు ఈ సవాలుకు అంగీకరించింది. ఎన్నికలలో కాంగ్రెసుకే విజయం లభించింది. 1934 నుండి 1945 వరకు కేంద్రశాసన సభలో కాంగ్రెసుపక్షం ప్రశంసనీయమైన ఐకమత్యంతో ప్రభుత్వాన్ని ఎదిరించడంలో అకుంఠితమైన శక్తిని ప్రదర్శించింది. శాసనసభా సమావేశాలకు వారు హాజరయిన సమయాల్లో ప్రవేశపెట్టబడిన ప్రతి ఆయవ్యయ పట్టికను త్రోసివేశారు.

## 2. బాధ్యతాయుత పరిపాలనా శకము.

1935 లో నూతన్నభారత ప్రభుత్వశాసనం చేయబడి అందులో రాష్ట్రీయ స్వాతంత్ర్యానికి సంబంధించిన భాగము మాత్రం అమలు జరుపబడింది. 1937 లో జరిపిన ఎన్నికలలో మొత్తం 11 రాష్ట్రాలకు 6 రాష్ట్రాలలో కాంగ్రెసుకు అఖండ విజయం లభించింది. కాని ఆ శాసనంలో గవర్నరులకు గల ప్రత్యేకాధికారాలను, వారు మంత్రివర్గముల దైనందిన కార్యక్రమంలో కలుగజేసుకొనడానికి ఉపయోగించరు–అని వాగ్దానం చేస్తేనేగాని మంత్రివర్గాలను ఏర్పాటు చేయము అని కాంగ్రెసువారు తెలియపరిచారు. 4 నెలల తరువాత 1937 జూన్‌లో యీ హామీ యివ్వబడిన తరువాత జూలైలో 6 రాష్ట్రాలలోను కాంగ్రెసు మంత్రి

వర్గాలు ఏర్పాటు చేయబడినాయి. తరువాత అస్సాము, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రము కాంగ్రెసును అనుసరించాయి. దీనితో కాంగ్రెసు చరిత్రలో కేవల ఆందోళనా యుగము మారి బాధ్యతాయుత పరిపాలనా శకము అనే నూతనాధ్యాయము ప్రారంభమయింది. కాంగ్రెసు ప్రభుత్వాలు 2 సంవత్సరముల 3 నెలలు మాత్రం పరిపాలన చేశాయి. ఈ కొలదికాలంలోనే కొన్ని నూతన శాసనములను, అనేక సంస్కరణలను అమలు జరుపగలిగాయి. కర్షక ఋణబాధా నివారణశాసనము, మద్యపాన నిషేధశాసనము చేయడానికి ముఖ్యంగా అన్ని కాంగ్రెసు మంత్రివర్గాలు మొదట శ్రద్ధవహించాయి. సంయుక్తరాష్ట్రాలు, ఒరిస్సా మొదలైన రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు,-1931లో కరాచీలో చేయబడిన ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని అనుసరించీ, 1936లో లక్నోలో ఆమోదించబడిన కర్షక సంస్కరణలను అనుసరించీ-వ్యావసాయిక సంస్కరణలను చేయడానికి పూనుకున్నాయి. జమీందారీరైతు సమస్యలను పరిష్కరించడానికి, శాశ్వత జిరాయతీ హక్కులీయబడిన ఎస్టేటులలో భూమిని దున్నేరైతుకే భూమిహక్కును కలిగించడమూ, భూమిని దున్నేరైతుకీ గవర్నమెంటుకీ మధ్యగా ఉండి కొంత ఫలసాయాన్ని అనుభవించేవారి యొక్క హక్కులను తగ్గించడమూ వారు దృష్టిలో ఉంచుకొన్న ముఖ్య ఆశయాలు. మద్రాసు రాష్ట్రంలో జమీందారీల స్థితిగతులను విచారించి నివేదించడానికిగాను శాసన సభచే నియమింపబడిన ఉపసంఘమువారు సమగ్రమైన

నివేదికను తయారుచేశారు; సంయుక్త రాష్ట్రాలలో గ్రామ పునర్నిర్మాణము ముఖ్యంగా పరిగణింపబడింది; బీహారులో నిరక్షరాస్యతానిర్మూలనము ప్రధానంగా పరిగణింపబడింది; బొంబాయి, మధ్య రాష్ట్రాలు ప్రాథమిక విద్యాశాలల వ్యాప్తికి ప్రత్యేకత వహించాయి; మదరాసు రాష్ట్రంలో ఖద్దరు అభివృద్ధికి గ్రాంటులు ఈయబడినాయి. కాంగ్రెసు మంత్రివర్గాలు అసిధారావ్రతం చేయవలసి వచ్చింది. ఒక వైపున, వారు చాలా తీవ్రములయిన మార్పులు చేయడానికి ప్రయత్నిస్తున్నారు-అని విమర్శలు బయలుదేరినాయి;మరొక వంక వారు కార్మికులకు కర్షకులకు ఏమీ ఉపకారం చేయడం లేదని రైతులు, కూలీలు వారిపై నిందలుమోపుతున్నారు. ముఖ్యంగా సోషలిస్టు, కమ్యూనిస్టు శక్తులు విజృంభించాయి. ఈ నూతన శక్తులు 1936లో లక్నో కాంగ్రెసులోనే తల లెత్తాయి. ఆ సంవత్సరమే ఫెయిజపూర్ సమావేశంలో పాశ్చాత్య సామ్యవాద సిద్ధాంతాలను భారతీయ సంప్రదాయానుగుణంగా మార్పుచేయడం అవసరమని గుర్తించ బడింది. మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు ప్రతికూల శక్తులు హిందీ భాషా వ్యాప్తికి తమ అసమ్మతిని సూచించడానికి ప్రతికూల ప్రదర్శనాలతో సత్యాగ్రహం ప్రారంభించారు. కొన్ని వందలమంది కుర్రవాళ్లు జైలుకు పంపబడ్డారు. మద్రాసు మంత్రులు ఆంధ్ర దేశమును మద్రాసు రాష్ట్రము నుండి విడదీసి ప్రత్యేక రాష్ట్రంగా చేయడానికి ప్రయత్నించి విఫలులయారు.

వివిధ కాంగ్రెసు మంత్రివర్గాలు చేసినపనిని జాగ్రత్తగా పోల్చి చూడటం అవసరం. కాని ఆపని నెరవేర్పదగిన కేంద్ర ప్రభుత్వం లేకపోయింది. అందువలన కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమే ఆపని చేయవలసి వచ్చింది. బీహారు సంయుక్త రాష్ట్రాల మంత్రులు పౌర్జన్యకరములైన చర్యలకుగాను శిక్షింపబడిన రాజకీయ ఖైదులను విముదలచేయుడానికి ప్రయత్నింపగా—బహుశః ఇవి వారి అధికారాలలో లేదని కాబోలు—గవర్నరులు వారిని ఆటంకపరిచారు. అందువలన ఆరెండు మంత్రివర్గాలు రాజీనామా యిచ్చాయి. కాని అనంతరం 1938లో జరిగిన హరిపుర కాంగ్రెసు ఆమంత్రివర్గాల చర్యలను సమర్థించి బలపరచడంవలన రాజప్రతినిధి మనస్సు మార్చుకోటం, గవర్నరులు తమ పట్టుదలను వదలుకోటము జరిగింది. ఒరిస్సాలో తమక్రింది ఉద్యోగిని గవర్నరుగా నియమింప దలచుకొన్న ప్రభుత్వచర్యను కాంగ్రెసు మంత్రులు విజయవంతంగా ప్రతిఘటించారు. స్త్రీని చెరచిన నేరానికి శిక్షింపబడిన ఒక ఉన్నత విద్యాశాఖాధికారిని ఆతనిశిక్ష పూర్తిగాక పూర్వమే విముదలచేయగా, ఈ అశాస్త్రీయ ప్రవర్తనను అరికట్టడానికి కాంగ్రెసు కార్యవర్గం కలిపించుకొని సంయుక్తరాష్ట్ర జైలు న్యాయశాఖల మంత్రిచేత రాజీనామా ఇప్పించింది. తరువాత కొంతకాలానికి ప్రధానమంత్రి మరికొందరు మంత్రులను తొలగింపదలచి, అందుకు పార్లమెంటరీ కమిటీవారి అనుమతినిగాని, కార్యవర్గము వారి అనుమతినిగాని పొందకుండా నే—మొత్తం మంత్రివర్గానికి రాజీనామాఇచ్చినందున కార్యవర్గం

ఆ ప్రధానమంత్రిని తొలగించి ఆయనస్థానే మరొకరిని ప్రధానమంత్రిగా ఏర్పరిచింది.

## ౮. యుద్ధ శకము.

1939 సెప్టెంబరు 3-వ తేదీన ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం ప్రారంభంకాగానే యుద్ధకృషికి కాంగ్రెసు తోడ్పాటు చేయవలెనా లేదా అనే సమస్య బయలుదేరింది. 1929-వ సంవత్సరమునుండి యుద్ధమురావచ్చును అనే ఉద్దేశ్యముతోనే కాంగ్రెసు దేశాన్ని సన్నద్ధం చేస్తూంది. చివరకు యుద్ధం ప్రారంభమయింది; వెంటనే కాంగ్రెసు బ్రిటిషుప్రభుత్వాన్ని తమ యుద్ధాశయాలను నిర్వచించాలనీ, వాటిని భారత దేశానికి ఎలా వర్తింపచేయదలచుకొన్నది స్పష్టీకరించాలనీ కోరింది. తాము ఇంకా తమ యుద్ధాశయాలను నిర్ణయించుకోనేలేదని బ్రిటిషు గవర్నమెంటు అతి విచిత్రమైన సమాధానం చెప్పింది. ఇందువలన కాంగ్రెసు మంత్రివర్గాలకు రాజీనామా నీయడం తప్ప మార్గాంతరం లేకుండా పోయింది. 1939 అక్టోబరు, నవంబరు మాసాలలో వారందరు రాజీనామా యిచ్చారు. 1935 చట్టములో 93-వ సెక్షను నాధారంచేసుకుని ఆయా రాష్ట్రగవర్నరులే అధికారం వహించి చెలాయించడ మారంభించారు. 1940 ఆగస్టులో రాజప్రతినిధి లిన్‌లిత్గో ప్రభువూ, భారత కార్యదర్శి అమెరీ—ఇద్దరు ఒకేమారు, 9 కోట్లనుండి మహమ్మదీయులు ఇష్టపడటంలేదు గనుక 1935 చట్టములోని ఫెడ

లేషనుకు సంబంధించిన భాగాన్ని అమలు జరపడం సాధ్యం కాదనీ, తాత్కాలికంగా రాజప్రతినిధి కార్యవర్గంలో మరి కొన్ని స్థానాలుమాత్రం భారతీయులకు ఈయబడతాయి అనీ ప్రకటించారు. భారతదేశం తనకు తెలియకుండానే, తన అభిమతానికి విరుద్ధమైన, తనకు ఏవిధంగానుగాను సంబంధంలేని యుద్ధంలోకి బలవంతంగా ఈడువబడింది. ఈ అవమానకరమైన విధానాన్ని ఎదుర్కొనడానికి కాంగ్రెసు వెంటనే వ్యక్తిసత్యాగ్రహాన్ని ప్రకటింపక తప్పిందికాదు. ఈ ఉద్యమాన్ని నడపడానికి గాంధి బయటనే ఉండిపోయాడు. ఇది తనకూ అనుకూలంగానే ఉండటమువలన రాజప్రతినిధి కూడా ఇందుకు అనుమతించాడు. ఈ ఉద్యమంలో పాల్గొనే ప్రతిసత్యాగ్రహి నూలు వడక గలిగి ఉండాలి, వడకడంలో నైపుణ్యంకూడా సంపాదించి ఉండాలి. పేరుపేరు వరుసన జాగ్రతగా విమర్శించి సత్యాగ్రహం చేయవలసినవారి జాబితాలు తయారు చేయబడినాయి. ఉద్యమం ఒక సంవత్సరం సాగిన తరువాత సత్యాగ్రహ ఖైదీలందరు విడుదల చేయబడ్డారు.

ఇక మనం 1942–వ సంవత్సరములోకి వస్తున్నాం. 1942 మార్చి ప్రారంభంలో సర్ స్టాఫర్డుక్రిప్సు బ్రిటిషు ప్రభుత్వం వద్దనుంచి భారతదేశానికి ఒక నూతన సూచనను తీసుకొని రాబోతున్నాడని పార్లమెంటు సభలో ప్రకటించారు. మార్చి 23–వ తేదీన క్రిప్సు భారతదేశంలో దిగాడు; ఏప్రిల్ 12–వ తేదీన తిరిగి వెళ్ళిపోయాడు. క్రిప్సు ఇక్కడ ఉన్న సమయంలోనే జపాను విమానాలు, యుద్ధసామగ్రి

తీసుకొని వస్తూన్న కొన్ని అమెరికను ఓడలను వెంటాడివచ్చి ట్రింకోమలీనుండి విశాఖపట్టణం వరకు తరిమాయి. విశాఖ పట్టణంలోను, కాకినాడలోను బాంబులు వేయబడినాయి. కాకినాడ హార్బరులో ప్రజల మీద మరతుపాకులు కాల్చ బడినాయి. కాని ఈ తుపాను ఎలాగో శాంతించింది. అను కున్న ప్రకారం భారతదేశం మీదకు దండయాత్ర మాత్రం రాలేదు. మద్రాసు గవర్నరు కంగారుపడి రేవులో ఉన్న పడవలన్నింటినీ నడి సముద్రంలోకి నెట్టివేయించి వాటిగతి వాటిని చూచుకోమన్నాడు. ప్రజలందరిని నగరంవిడిచి వాళ్ళ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళిపొమ్మని హెచ్చరిం చాడు. ప్రజలు కంగారుపడిపోయి పరుగులెత్తారు. చివరకు ఏప్రిల్ 20-వ తేదీకి ఈ హంగామా అంతా శాంతించింది. సర్ స్టాఫర్డు క్రిప్సు ఢిల్లీలో దిగగానే తాను తెచ్చిన మూటవిప్పి ప్రభుత్వసూచనను ప్రకటించి, కాంగ్రెసు అధ్యక్షునితో సంప్రతించాడు. ఆదిలో ఆయన, ఏర్పడబోయే నూతన భారత మంత్రివర్గానికీ రాజప్రతినిధికీ మధ్య బ్రిటిషు మంత్రివర్గానికీ చక్రవర్తికీ గల సంబంధమే ఉంటుందని హామీ ఇచ్చాడని కాంగ్రెసు అధ్యక్షుడు తరువాత ప్రకటిం చాడు. భారత సమాఖ్యలోనుండి ఏ రాష్ట్రమైనాసరే విడిపో వచ్చు అనే అవకాశాన్ని ఇస్తున్నాయి గనుక ఈసూచనలు పనికిమాలినవి, అనీ, వాటినింక పరిశీలించవలసిన అవసరం లేదనీ గాంధి తన అభిప్రాయాన్ని వెల్లడించినా, క్రిప్సు ఇచ్చిన హామీ చాలా ఆశలకు కారణమయింది. గాంధి ఏప్రిల్ 5-వ తేదీన ఢిల్లీనుంచి వెళ్ళిపోయాడు. తరువాత

ఆయన కార్యవర్గ సమాలోచనలతో ఏవిధమైన సంబంధము కలిగించుకోలేదు. ఆ ప్రణాళికలో సంస్థాన ప్రజలకు ఏమీ స్థానంలేదు. అధినివేశ స్వాతంత్ర్యమో సంపూర్ణస్వాతంత్ర్యమో భారతదేశ భవిష్యత్తును భారతదేశమే నిర్ణయించుకోవాలి. యుద్ధానంతరం రాష్ట్రశాసన సభలకు ఎన్నికలు జరిగిన తరువాత వాటిలోనుండిఎన్నుకొనబడిన ప్రతినిధులతో రాజ్యాంగ విధాననిర్ణాయక సంఘం ఏర్పాటు చేయబడుతుందట. దీని కంతటికిప్రతిఫలంగా భారతీయులు యుద్ధకృషికి సహాయం చేయాలట. శాసనసభకు కాక రాజప్రతినిధికి బాధ్యత వహించేజాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలట. మొదటయుద్ధ కార్యనిర్వహణ బాధ్యతఅంతా ప్రధానసేనానిదే అన్నా,సంప్రతింపులలో, దేశరక్షణశాఖకు సంబంధించిన కొన్ని చిల్లరపనులు చూడటానికి వేరే ఒక దేశరక్షణ శాఖా సభ్యుణ్ణి నియమించడానికి కూడా క్రిప్సు అంగీకరించాడు. కాని దీనికి కాంగ్రెసువారు అంగీకరింపలేదు. సంప్రతింపులు విఫలంకావడానికి కారణాలు: మంత్రివర్గం శాసనసభకు బాధ్యతవహించడానికి అంగీకరించక పోవడము; దేశరక్షణ శాఖాసభ్యుని అధికారాన్ని విస్తృతం చేయుడానికి నిరాకరించటము. లండనునుంచి క్రిప్సుకు వెన్నులోపోటు తగిలిందని, సంప్రతింపుల మధ్యలో, ఆతనికి ప్రథమంలో ఇచ్చిన స్వాతంత్ర్యం తగ్గింపబడిందనీ, ఆ రోజులలో బాగా చెప్పుకున్నారు. ఏది ఎలాగైనా క్రిప్సు రాయబారం విఫలమయింది. ఈ వైఫల్యానికి బాధ్యత ఆయన కాంగ్రెసు మీాద, గాంధీమీాద తోశాడు. ఆయన తిరిగి వెళ్ళడానికి

ముందు "ఇకముందు భారతదేశం పూర్వమెన్నడూ ఎరుగని తీవ్రనిర్బంధ విధానాన్ని చవిచూడబోతూన్న"దని ఇద్దరు భారతీయులతో చెప్పివెళ్లాడు.

## ౯. ప్రజావిప్లవ శకము

ఇక మరొక శకం—ప్రజావిప్లవ శకం—ప్రారంభమయింది. క్రిప్సు వెళ్ళిపోయిన తరువాత దేశంలో ఒక విధమైన రాజకీయ స్తబ్ధత ఏర్పడింది. ప్రకృతిలాగే రాజకీయాలుకూడా స్తబ్ధతను నిరసిస్తాయి అన్నసుప్రసిద్ధ సత్యానికి అనుగుణంగా ఈ స్తబ్ధతలోనుండి సప్తముఖాల ప్రజారోషం బయలు వెడలింది. బ్రిటిషువారి అధికారం సాగుతూ ఉన్నంతవరకు ఈ దేశానికి ముక్తి లేదని భావించాడు గాంధి. మొదట మతసామరస్యము తరువాత స్వారాజ్యం అనే తన పూర్వనినాదాన్ని తల్లక్రిందులుచేసి, బ్రిటిషువారు దేశాన్ని వదలి పోవటమే ముందుజరగాలి—అనగా వారు భారతదేశంలో తమ అధికారాన్ని వదలుకోవాలి అని మాత్రమే ఆయనభావం;—అని హెచ్చరించాడు. యుద్ధనిర్వహణకోసము అమెరికాసేనలు ఈ దేశంలో ఉండవచ్చుననికూడా ఆయన అంగీకరించాడు. కాని బ్రిటీషు ప్రభుత్వాన్ని పారద్రోలడానికి ఆయన తన మామూలు పద్ధతిలోనే శాసనోల్లంఘనం ప్రారంభిస్తానన్నాడు. 1942 అగస్టు 8 వ తేదీన జాతీయ లక్ష్యాన్ని నిర్వచిస్తూ అ. భా. కాం. సంఘం ఒక తీర్మానం చేసింది. (1) భారతదేశం యుద్ధకృషిలో పాల్గొని—కేవల

నైతిక సహాయమేకాక భౌతికంగా కూడా – సహాయపడటానికి గాను ముందుగా ఈ దేశం తాను సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యములుగల దేశంగా భావించుకొనగలుగునట్లు చెయ్యాలి; (2) భారతస్వాతంత్ర్యం, ఇంతవరకు ఇంకా బ్రిటిషు సామ్రాజ్యాంతర్గతములైఉన్న ఇతర అధినివేశ రాజ్యాలన్నింటి యొక్క స్వాతంత్ర్యానికి ఉపోద్ఘాతంగాను, చిహ్నంగాను ఎంచబడాలి,—అని ఆ తీర్మాన సారాంశం. ఈ వాంఛలు తృప్తిపరుపబడక పోయినట్లయితే భారత దేశానికి వెంటనే సమష్టి శాసనోల్లంఘనోద్యమాన్ని ప్రారంభించడంతప్ప మార్గాంతరంలేదు, అని అ. భా. కాం. సంఘం ప్రకటించింది. ఆ ఉద్యమాన్ని నడపడానికి నాడు భారత జాతీయ మహాసేనానిగా నియమితుడైన గాంధి, తాను రాజప్రతినిధితో సంప్రతింప తలచుకొన్నాననీ అందుకోసం ఆయనకు వ్రాస్తున్నాననీ, ఆయనతో సంప్రతించిన మీదట గాని తాను ఉద్యమాన్ని ప్రారంభింపదలచుకొనలేదనీ విస్పష్టంగా ప్రకటించాడు. ఐనా 1942 ఆగస్టు 8 వ తేదీన తీర్మానం ఆమోదింప బడగానే 9 వ తేదీ తెల్లవారు ఝామున నే మహాత్మాగాంధీని, కార్యనిర్వాహకవర్గ సభ్యులను ఇంకా చాలామందిని అరెస్టుచేసింది ప్రభుత్వం. వారందరినీ ప్రత్యేకం ఒక రైల్లో (1) గాంధీని పూనాదగ్గర అర్థశీర్ణమై శిథిలావస్థలోఉన్న,—మహాత్ములైన తాపసులకు ఆశ్రమవాటికగా ఉపయోగ పడడానికంటె భూతప్రేత పిశాచాలకు నిత్యావాసంగా ఎక్కువ ఉపయోగపడే, ''ఆగాఖాన్ మహాభవనము'' అని పిలువబడే పాడువడియున్న

గృహంలో నిర్బంధించడానికీ; (2) కార్యనిర్వాహకవర్గాన్ని అహమ్మదునగరపు కోటలో నిర్బంధించి ఉంచడానికీ; (3) తక్కినవారిని తాత్కాలికంగా ఎరవాడ జైలులో ఉంచడానికీ,—తీసుకొని వెళ్ళారు. కార్యనిర్వాహకవర్గసభ్యులను ఎక్కడ నిర్బంధించి ఉంచినదీ 1944 ఫిబ్రవరి 22 వ తేదీ వరకు రహస్యంగానే ఉంచబడింది. ప్రభుత్వం తాను నిర్బంధింప దలచుకొన్న వారందరిని 3 ప్రత్యేకవర్గాలుగా విభజించింది,—(1) 9 వ తేదీన బొంబాయిలో పట్టుకొనబడిన వారు, (2) ఇండ్లకు చేరక పూర్వం రైళ్ళలో పట్టుకొనబడవలసినవారు, (3) వారివారి ఇండ్లవద్ద పట్టుకొనబడవలసినవారు. గాంధీ, కార్యనిర్వాహకవర్గ సభ్యులు పట్టుకొనబడగానే ఆ వార్త వెంటనే దావాగ్నిలాగ దేశమంతటికీ ప్రాకిపోయింది. 1919 లో అమృతసరములో జలియన్ వాలాబాగ్ హత్యాకాండ జరిగిన తరువాత గాంధీ పంజాబుకు వెళుతూవుండగా దారిలో, ఢిల్లీకి 60 మైళ్ళ దూరంలో ఉన్న పల్‌వాల్ అనే రైలుస్టేషన్‌లో ఆయనను అరెస్టు చేసి వెనుకకు పంపివేసినప్పుడు జరిగినట్లుగా, ప్రజలు విపరీతమైన ఆగ్రహావేశాలకు లోనయారు. బొంబాయిలోను, ఇతర నగరాలలోను ప్రజలు వేలు లక్షలకొలది గుంపులుగా బయలుదేరారు. వారిని వెనుకటివలె ప్రభుత్వం లాటీ దెబ్బలతోను కత్తిపోట్లతోనుగాక, ఈసారి తుపాకి కాల్పులతోను మరఫిరంగిగుండ్ల వర్షములతోను చెదరగొట్టింది. అధికారుల పశుబలాహంకార పూరితమైన ఈ దౌర్జన్యం మహోద్విగ్నములైన అపూర్వ ప్రజాసమూహాలలో పట్ట

 రాని రోషాగ్నిని ప్రజ్వలింపజేసింది. అంతటితో వారు అమిత ఆగ్రహావేశ పరవశులయినారు. తమకు మార్గదర్శకులయి సక్రమంగా నడిపించే నాయకులు వారిమధ్య లేకపోవడము వలన—వారి రోషాగ్ని నానాముఖాల వ్యక్తమయింది. ఈ పరిస్థితి విద్రోహక చర్యలకు కారణమయి ప్రభుత్వమువారి తుపాకిగుండ్లకు సమాధానంగా ప్రజలు రోపిడి, పరశురామ ప్రీతి జరపడం ప్రారంభించారు. వెనుకటికథే మళ్ళీ ప్రారంభమయింది. ప్రజలు ఆగ్రహావిష్టులైనప్పుడు ఆ ప్రజాపరవశత్వము వ్యక్తీకరింపబడే మార్గాలు, చిత్రంగా ఎప్పుడు ఒకే రీతిగా ఉంటున్నాయి. 1919 లో జరిగిన సంఘటనలే తిరిగి మళ్ళీ 1942 లోను జరిగాయి. రైలుస్టేషనులు కచేరీలు కాల్చివేయబడినాయి, రైళ్లు ఆపివేయబడినాయి, కొన్నిచోట్ల రైలుపట్టాలుకూడా తీసివేయబడినాయి,—చిత్రంగా ఒక్క ప్రాణమన్నా నష్టంకాకుండానే 1942 లో ఇవన్నీ జరిగినాయి;—టెలిగ్రాఫ్ తీగెలు తెగకొట్టబడినాయి, రాకపోకల మార్గాలు స్తంభింప జేయబడినాయి; కొన్ని నగరాలు దేశంలోని ఇతర భాగాలతో సంబంధంలేకుండా వేరుచేయబడినాయి; కొన్నిచోట్ల మండలాలే బయటిదేశంతో సంబంధం లేనివిగా చేయబడినాయి; ఖజానాలు దోచుకొనబడినాయి; ప్రభుత్వ భవనాలమీద జాతీయపతాకలు ఎగురవేయబడినాయి; కొన్నిస్థలాల్లో మాత్రం ప్రభుత్వోద్యోగులు హత్యచేయబడినారు. దీనికి ప్రతిగా ప్రభుత్వమూ ఏమీ వెనుక ముందాడకుండానే ప్రవర్తించింది. ప్రజల ఇండ్లతగుల బెట్టించింది, ప్రజాసమూహాలమీద విచ్చలవిడిగా తుపాకులు

కాల్పించింది. వంగరాష్ట్రంలో మూడుచోట్ల, బీహారులో ఒకచోట-ఒరిస్సాలో ఒకచోట- మొత్తం ఐదుచోట్ల విమానాలలోనుండి మరతుపాకులు కాల్పించింది, దురదృష్టవశాత్తు ఒకచోట అమాయకులైన రైల్వేకూలీలగుంపు ఒకటి ఈ మరతుపాకి కాల్పులకు గురియైంది. ప్రభుత్వము, ప్రజలు- జరిగిన దురంతాలను, దౌర్జన్యాలను గూర్చి ఒకరిపై ఒకరు చేసిన నేరారోపణలను వివరంగా వ్రాయాలంటే పెద్దగ్రంథం అవుతుంది. 1942 లో పార్లమెంటు సమావేశమయి, భారతదేశంలో కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వాల చర్యనంతను ఆమోదించింది. చర్చిలుగారు చాలా శ్రమపడి కాంగ్రెసు భారతదేశంలో ఎవరికీ ప్రాతినిధ్యము వహించదు అని నిరూపించడానికి ప్రయత్నించాడు. భారత కార్యదర్శి అమెరీ కార్యనిర్వాహక వర్గమువారు పశ్చాత్తాపాన్ని వెల్లడించి క్షమాపణ కోరుకొనవలసినదే అన్నాడు. కామన్సు సభా ఉపన్యాసాల్లోనో, ఇతరత్రా బహిరంగసభల్లోనో ఎక్కడో అక్కడ ఆయన వారాని కొకసారి అయినా, - వారు తాము చేసిన తప్పులకు పూర్తిగా క్షమాపణకోరి, ప్రస్తుతం యుద్ధకృషికి తోడ్పాటుచేస్తామని స్పష్టంగా వాగ్దానంచేసి, తమ భవిష్యత్ప్రవర్తనకు తగిన హామీల నిచ్చేటంతవరకు కార్యనిర్వాహకవర్గ సభ్యులను ప్రవాసంలోనే ఉంచుతామనీ, వారికి ఉత్తర ప్రత్యుత్తరాలకుకూడా అవకాశంఇయ్యమనీ, విడుదలచేయము అని - ప్రకటిస్తూనే ఉన్నాడు. కొన్నిమిత వాద పత్రికలు, కార్మికపక్ష పత్రికలుమాత్రం కాంగ్రెసు నాయకులను విడుదలచేసి మళ్లీ కాంగ్రెసుతో సంప్రి

తింపులు. ప్రారంభించడం బ్రిటిషువారికీ, భారతదేశానికీ కూడా శ్రేయస్కరమన్న విషయాన్ని బ్రిటిషు ప్రభుత్వానికి నచ్చచెప్పడానికి మళ్లీ మళ్లీ ప్రయత్నిస్తూనే ఉన్నాయి. కాని, పాలకులు మాత్రం దీనిని వినిపించుకోలేదు.

ఈపరిస్థితులు ఇలా ఉండగా 6 నెలలు నిర్బంధావాసం గడిపిన తరువాత గాంధి 21 రోజులు నిరశనవ్రతం చేస్తానని ప్రారంభించాడు. అయితే ఆయన, అది మరణ పర్యంతంచేసే నిరశనవ్రతం కాదనీ, తాను చనిపోవ కోరడం లేదనీ ముందుగా రాజప్రతినిధి లిన్‌లిత్గో ప్రభువుకీ, భారతప్రభుత్వానికీ తెలియపరిచాడు. 1943 ఫిబ్రవరి నెల 10 వ తేదీన నిరశనవ్రతం ప్రారంభమయింది. గాంధీ దారుణ హింసాపూరితమైన ఉద్యమాన్ని లేవదేసి, తత్ఫలితంగా న్యాయశాస్త్రరీత్యా తప్పని సరిగా తాను అనుభవింపవలసివచ్చిన శిక్షకు వెరచి, భీరులై, దానినుండి విముక్తుడు కావడానికి ఉపవసించి మరణింప దలచుకొన్నాడు - అని లిన్లిత్గో ప్రభువు దారుణమైన, అమానుషమైన వ్యాఖ్యానం చేశాడు. నిజంగా ఆయన అన్నట్లే - నిజమైన భీరువు లందరు తమ దౌష్ట్యాలకు పరిహారంగా గాంధీ మార్గాన్నే అనుసరిస్తే ఎంత బాగుండును! గాంధి వెనుకటి నిరశన వ్రతాలలో వలె ఈమారు ఉపవాసక్లేశాన్ని అంత సులభంగా సహించలేకపోయాడు. ఆయన జీవితములో అది 14 వ నిరశన వ్రతం - పైగా 73 సంవత్సరముల వార్ధక్యదశలో! ఆయన వార్ధక్యము - నిరశన వ్రతాలను ప్రశాంత చిత్తతతో సాగింపగల ఆయన శక్తిని సన్నగిల

చేసింది. ఈ నిరశనవ్రతం వివిధ స్థలాలలో వివిధ రీతుల విమర్శింపబడింది. బ్రిటన్, అమెరికాలు ప్రమాదకరము లైన ఆ 21 దినాలు విస్మయంతోను, ఆవేగంతోను నిరీక్షించాయి గాని, చివరకు నిరశనవ్రతం విఫల మయింది అని ప్రకటించాయి. అసలు యధార్థం - ఆనిరశనవ్రతము యొక్క వాస్తవికాశయాన్ని వారు అర్థం చేసుకోలేక పోయారు. దాని ఉద్దేశం బ్రిటనును లొంగదీసి కాంగ్రెసుతో రాజీకి వచ్చేటట్లు చేయడంకాదు. తనకు విధింప బడిన బలవంతపు జీవన్మృతస్థితియెడల తన అసమ్మతిని వెల్లడించడానికీ, తనయొక్క, కాంగ్రెసుయొక్క ప్రతిష్ఠను వెల్లడించడానికీ మాత్రమే ఆయన నిరశన వ్రతానికి పూనుకున్నాడు. 1943 మార్చి 3 వ తేదీన ఉపవాసము పూర్తిఅయింది. తిరిగి ప్రభుత్వం యధా ప్రకారంగా తన నిర్బంధ విధానమును సాగించింది.

వారాలు గడిచాయి; నెలలు, సంవత్సరాలు గడిచి పోతున్నాయి. బ్రిటిషువారి దృక్పథం తిన్ననై న్యాయ ధర్మమార్గముల ననుసరింపగల దనడానికి సూచనకూడా కనుపించడంలేదు. సంవత్సరాని కొకమారు. గవర్నరుల ఉద్యోగ కాలపరిమితిని పొడిగింపవలసి యుండుటచేత కామన్సుసభలో ప్రతిసంవత్సరం భారతదేశ వ్యవహారాలను గూర్చిన చర్చకు అవకాశం ఈయవలసి వచ్చేది. ఏమేటికాయేడు - 'భారత కాంగ్రెసు తనపంథాను మార్చుకోవాలి' అనే ఆపాతపాటనే బ్రిటిషు రాజకీయవేత్తలందరు మళ్లీమళ్లీ పాడారు. అమెరికను పత్రికలలో కొన్నిమాత్రం

కాంగ్రెసు ఆశయాల యెడల సానుభూతిని ప్రకటించి, బ్రిటిషువారే తమ విధానాన్ని పునః పరిశీలన చేసుకోవాలని ఒత్తిడిచేశాయి. రూజ్వెల్టు అధ్యక్షుని ప్రతినిధి, విలియంఫిలిప్సు గాంధీని కలుసుకొని మాట్లాడటానికి అనుమతి కోరడు. కాని బ్రిటిషు ప్రభుత్వమునుండి ఆయనకు ఆ అనుమతి లభించలేదు. ఆయన ఎంత అభ్యుదయకరమైన భావములు కలవాడైనది రూజ్వెల్టు అధ్యక్షునికి ఆయన పంపిన, – తరువాత ప్రకటింపబడిన – నివేదికలోని భావాలలో వ్యక్తమవుతుంది. కాని అలాంటి అభ్యుదయకరులైన రాజకీయజ్ఞులవలన బ్రిటనుకు ప్రయోజనం లేదు. నిజానికి తనదేశము కూడా సామ్రాజ్యవాదకళంకితమైనదే కావడంవలన రూజ్వెల్టు బ్రిటిషు సామ్రాజ్యవాదులకు వారి నిరంకుశ సామ్రాజ్యవాద విధానంలోని దోషాలను ఎత్తిచూపి, తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తింపలేకపోయాడు. చైనా భారతదేశపు పక్షాన కలుగజేసుకొన్నదిగాని బ్రిటనువంటి బలవత్తరమైన సామ్రాజ్యంతో ఎదురుపడి మాట్లాడటానికి, నాటి అంతర్జాతీయ పరిస్థితులలో చైనా చాల బలహీనమయిన దేశం అయింది. ఎక్కువ మాట్లాడకపోయినా, రష్యా తాను మాట్లాడినంతవరకు ధైర్యంగా, గట్టిగా చెప్పగలదు కాని మొత్తముమీద ఆ దేశమూ పట్టుదలగా నిలబడలేదు. దీనిలో నిజమెంతో తెలియదుగాని క్రిప్సు సూచనలు అమెరికావారి పుఱకుబడినవల్లను, సిమ్లాసమావేశానికి కారణాలయిన తరుపరి సూచనలు రష్యావారి ఒత్తిడి వల్లను ప్రాముర్భవించాయని వదంతి.

కాలము గడిచినకొలది భారత రాజకీయ ప్రతిష్టంభనము బ్రిటనుకు కొంత అశాంతికి కారణమయింది. భారత రాజకీయవేత్తలు ఏనాటికైనా దాసోహం అనకపోతారా అని పెద్ద ఆశ పెట్టుకొని కూర్చున్నది బ్రిటను. కాని వారు తమకు సహజమైన పట్టుదలతో, ఓర్పుతో బ్రిటను ఆశలను నిరాశలుచేశారు. ఛాంబర్లేను తరువాత చర్చిలు ప్రధాన మంత్రికాగానే, 1940 మే 10 వ తేదీన, జెట్లెండుస్థానే భారత కార్యదర్శి పదవి నధిష్టించిన అమెరీమాత్రం విసుగు విరామాలు లేకుండా, – భారత రాజకీయవేత్తలు కార్య నిర్వాహకవర్గాన్ని వదలివేసి స్వతంత్రంగా తమ దేశానికి రాజ్యాంగ విధానమును (అంటే బ్రిటిషు రాజ్యాంగము వంటి కాదనీ, అమెరికా, స్విట్జర్లండుల రాజ్యాంగ పద్ధతిలో ఉండాలి – అనికూడా ఆయనే చెప్పాడు) నిర్ణయించుకోవాలి అనీ పదేపదే చెపుతూనే ఉన్నాడు. భారతదేశం బాధ్యతాయుత ప్రభుత్వంలోపడి కొట్టుకొనడం మంచిది కాదనీ, వాషింగ్టనులోను, జినీవాలోను ఉన్నట్లు శాశ్వత కార్యకారి వర్గాలను ఏర్పాటు చేసుకొనడం చాలామంచిది అనీ – అమెరీ చేసిన హితబోధకు సారాంశం. తానుచెప్పిన పద్ధతులమీద జైళ్ళవెలుపల ఉన్నవారూ, క్రొత్తగా విశ్వ విద్యాలయాలలో తయారయి వచ్చిన యువకులూ అందరు కలిసి భారతదేశానికి రాజ్యాంగ విధానాన్ని తయారు చెయ్యవలసినదిగా అమెరీ తిరిగి తిరిగి హెచ్చరించాడు. కాని మొత్తము మీద భారతదేశమునుండి ఆయన కోరిన సహకారం లభించలేదు. ముస్లింలీగు సంబంధులు తప్ప తక్కిన

భారతీయులందరు ఎంతో పట్టుదలతో,—కాంగ్రెసును విడుదలచేసి నిజమైన జాతీయనాయకులతో సంప్రతింపులు జరపాలని ఐక్యకంఠంతో స్పష్టంగా చెప్పారు. అమెరీ, చర్చిలు, టోరీలు, మితవాదులు, కార్మిక పక్షీయులు—బ్రిటిషు రాజకీయవేత్తలందరు ఒక విషయంలో పూర్తిగా ఏకీభవిస్తున్నట్లు చెప్పారు. భారతీయులకు అధికారాన్ని వప్పజెప్పడానికి వారందరు సంసిద్ధంగానే ఉన్నారట; అయితే ఆ అధికారాన్ని ఎవరికి, లేక ఏ పక్షము వారికి వప్పజెప్పాలి అన్నది ఒక్కటే వారిని బాధిస్తూన్న సందేహమట! భారతదేశ భవిష్యత్తును గూర్చి భారతీయులందరికీ ఏకాభిప్రాయము, ఏకదృక్పథము కలగాలని వారి కోరిక. ఇది జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడంలోనే కాదు; రాజ్యాంగ విధానమును నిర్ణయం చేయవలసిన రాజ్యాంగవిధాన నిర్ణాయక పరిషత్తును ఏర్పరచే విధానంలో కూడా వారందరు ఏకీభవించాలట!

1944 మే నెలలో ఆగాఖాన్ భవనంలో గాంధీగారికి ప్రమాదకరమైన అనారోగ్యం కలగడం వలన ఆయనను విడుదలచేయటం తప్పనిసరి అయింది. 1944 మే 6-వ తేదీన ఆయనను విడుదలచేశారు. వెంటనే ఆయన 1942 ఆగస్టు 8-వ తేదీ తీర్మానంలోని సమష్టి సత్యాగ్రహానికి సంబంధించిన భాగానికి కాలదోషం పట్టిందనీ, 1944 లో 1942-వ సంవత్సరపు కార్యక్రమానికి పూనుకోవడం అసమంజసమనీ ప్రకటించాడు. కాని దానితో పాటే, ఆ తీర్మానంలో జాతీయ వాంఛితానికి సంబంధించిన భాగం మాత్రం

అమలులోనే ఉన్నదని కూడా ఆయన ప్రకటించాడు. 'న్యూజ్ క్రానికల్' పత్రికా ప్రతినిధికి ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో ఆయన సమస్యా పరిష్కారానికి తన షరతులను కూడా స్పష్టీకరించాడు, కాని వాటికి ప్రత్యుత్తరం కూడా రాలేదు. ఇక్కడ భారతదేశంలో లిన్లిత్గో ప్రభువు తరువాత రాజప్రతినిధి పదవి నధిష్టించిన వేవెలు ప్రభువు కొంచె మించుమించు ఆ పాత బ్రిటిషు ధోరణిలోనే మాట్లాడుతున్నాడు. అంతేకాదు మరోమెట్టుపైకి కూడా వెళ్ళాడు;— 1944 ఆగస్టు 15-వ తేదీన అప్పుడు జిన్నాతో సంప్రతింపులు జరుపుతూ వుండిన గాంధీకి ఒక లేఖవ్రాస్తూ—ముస్లింలీగూ, కాంగ్రెసూ ఏకీభవించినంత మాత్రముచేత చాలదనీ, రాజకీయాభివృద్ధి చేకూరాలంటే దేశంలోని తక్కిన ప్రముఖ పక్షాలన్నీ కూడా ఏకీభవించాలి అనీ తేల్చాడు. 1944 సెప్టెంబరు నెలలో పాకీస్థాను సమస్యను గూర్చి జరిగిన గాంధీ-జిన్నా సంప్రతింపులు విఫలం కావడం వలన బ్రిటిషు వారి పాతపాటకు మరింత బలంచేకూరింది. భారతదేశంలో ఐక్యత సిద్ధించనిదే ఏ విధమైన రాజకీయ పురోభివృద్ధికి అవకాశం లేదు—అనే తమ వాదాన్ని బలపరుచుకొనడానికి వారికి ఈ సంఘటన బాగా ఉపయోగపడింది.

ఈ లోగా యూరప్ ఖండంలో చరిత్ర పరుగులు పెడుతూంది. జర్మనీ పరాజయం తథ్యమని తేలిపోయింది. యూరప్‌లో యుద్ధం పూర్తి అయిపోతూంది గనుక చర్చిల్ ప్రభుత్వం భారత రాజకీయ పరిస్థితిని పునః పరిశీలన చేయడం అవసరమని భావించింది కాబోలు. 1945 మార్చి 23-వ

తేదీన వేవెలు ప్రభువు—కేంద్రశాసన సభలో ఆయవ్యయ పట్టికపై చర్చ ఇంకా జరుగుతూ ఉండగానే—అకస్మాత్తుగా ఇంగ్లాండు వెళ్ళాడు. వెంటనే లండను నుండి ఒక ప్రకటన వెలువడింది. 1944 సెప్టెంబరు నెలలోనే వేవెలు ప్రధాన మంత్రితోను, భారత కార్యదర్శితోను భారత దేశ వ్యవహారాలను గురించి స్వయంగా మాట్లాడగోరి యుండెననీ, కాని భారత కార్యదర్శి వేవెలు యొక్క లండను ప్రయాణాన్ని వాయిదా వేయించినాడనీ– ఆ ప్రకటనలో వెల్లడించారు. 1945 మార్చి నెల ఈ సంప్రతింపులకు అనుకూలమైనదిగాను, తగినదిగాను భావింపబడింది. వేవెలు ప్రభువు లండను నుండి తిరిగివచ్చి 1945 జూన్ 14–వ తేదీన ఒక రేడియో ఉపన్యాసంలో బ్రిటిషు ప్రభుత్వం అనుసరింప దలచుకొన్న విధానమును స్పష్టీకరించి, కార్యనిర్వాహక వర్గ సభ్యులందరు వెంటనే విడుదల చేయబడుతారు–అనే ప్రకటనతో ఉపన్యాసాన్ని ముగించాడు. ప్రస్తుతం ఆప్రకటన యొక్క మంచి చెడ్డలను గురించీ, తదనంతర సంఘటనలను గురించి, విమర్శింప కుండుటే ఉత్తమం.

కాంగ్రెసును నిర్లక్ష్యంచేసి, సత్యాగ్రహోద్యమాన్ని పరిగణింపక ఊరుకొనడమే మొదటినుంచి బ్రిటిషుప్రభుత్వం యొక్క ఆశయమూ, అనుసరిస్తూన్నవిధానము అయి ఉన్నది. 1942 ఆగస్టులో చేయబడిన అ.భా.కాం.సం. తీర్మానంలో తలపెట్టబడిన ఉద్యమం ఆ కాంగ్రెసుమహాసంస్థచే నిర్వహింపబడిన ఇట్టి మహోద్యమ పరంపరలో నాల్గవది. ఆదిలో 1921 లో వేల్సుయువరాజు ఆగమన

సందర్భమున అసమ్మతి తెలపడానికి ఉద్దేశింపబడినది. అప్పుడు 30,000 మందికి కారాగారశిక్షలు విధింపబడ్డాయి. 1921 డిసెంబరులో జరిగిన గాంధి-రీడింగు సంప్రతింపులు, లిట్టను-దాసు సంప్రతింపులూ సఫలంకాబోయేసమయంలో ఆలీసోదరుల విడుదలకొరకు గాంధీ పట్టుపట్టడంవలన, అవి విఫలమైపోయాయి. వారిని అప్పుడు విడుదలచేయటము రాజప్రతినిధికి ఇష్టంలేదు. అయినా రాజప్రతినిధి అప్పుడు సమావేశపరుపబడబోతూన్న రౌండుటేబిల్ సమావేశానికి సభ్యులను పంపడంలో కాంగ్రెసు ఆలీసోదరులపేర్లనే సూచించవచ్చుననీ, అప్పుడు వారెలాగూ విడుదలచేయ బడతారనీ గాంధీతో చెప్పాడు; గాని దీనికి గాంధీ అంగీక రించలేదు. కాంగ్రెసువారు నిర్వహించిన రెండవ మహో ద్యమం 1930 వ సంవత్సరపు ఉప్పుసత్యాగ్రహం. 1931 మార్చి 5 వ తేదీన గాంధీ-ఇర్విను ఒడంబడికతో ఆ ఉద్యమం విరమింపబడింది. కాని ప్రభుత్వవర్గంలో ఈ ఒడంబడికయెడల విరుద్ధభావం ప్రబలింది. ఒడంబడికపైన సంతకాలు జరిగిననాటినుంచి సివిలుసర్వీసు ఉద్యోగివర్గం ఆ ఒడంబడికలోని షరతులకు భిన్నంగా ప్రవర్తించి, ఇర్విన్ ప్రభువు చర్యలన్నిటినీ తిరగదోసి 1932, 33, 34 సంవత్సరాలలో నిర్బంధవిధానాన్ని పునరుద్ధరించడంలో విశేషంగా సహాయంచేశారు. 1934 లో కేంద్రశాసనసభ

ఎన్నికలలో కాంగ్రెసుకు ఎలా విజయము చేకూరినది ఇది వరకే చెప్పబడింది. కాంగ్రెసు నడిపిన మూడవ అఖిల భారత ఉద్యమం—1940–41 లో బ్రిటను తన యుద్ధాశయాలను నిర్వచింపవలెననీ, అవి భారత దేశానికి ఎలా వర్తింపచేయబడేదికూడా వెల్లడించవలసిందనీకోరి, ఆ కోరిక నిరాకరింపబడినందువలన — ప్రారంభమయింది. యుద్ధకృషికి భారతదేశంచేసే తోడ్పాటు విషయంలో భారతదేశానికి సంపూర్ణ వాక్స్వాతంత్ర్యం ఉండాలని ధృవపరచడానికిగాను ఆవ్యక్తి సత్యాగ్రహం ప్రారంభింపబడింది. 1941 లో ఈ ఉద్యమం నిలచిపోయింది. తరువాత క్రిప్సు భారతదేశానికి వచ్చాడు. క్రిప్సు రాయబారం విఫలమయినప్పటికీ అసలు చర్చిలు క్రిప్సును భారతదేశానికి పంపడమే 1940–41 ఉద్యమం విజయం గుర్తింపబడినదనడానికి తార్కాణం. ప్రత్యక్షంగానో పరోక్షంగానో లభించిన ఈ విజయత్రయానంతరం భారతరాజకీయరంగములో మరల ఇట్టి సత్యాగ్రహప్రయోగాలు జరగడానికి అవకాశం కలిగించడము క్షేమకరమూ, వివేకమూ కాదని ప్రభుత్వం గుర్తించింది. అందువలన ఏమిజరిగినా సరేనని ప్రభుత్వం 1942–45 ఉద్యమంలో కాంగ్రెసును పూర్తిగా అణచివేయాలని నిర్ణయించుకొన్నది. బ్రిటనులోని రాజకీయశక్తిని మించిన శక్తులు ఉన్నాయని తేలింది — అను

ల్లంఘనీయమైన వజ్రసంకల్పంగల మరొకశక్తియేదో పని చేసి చర్చిలు, అమెరీ, వేవెలులను బలవంతపెట్టి, 1945 జూన్ 15 వ తేదీన కార్యనిర్వాహకవర్గసభ్యులను విడుదల చేసేటట్లు, జాతీయప్రభుత్వాన్ని ఏర్పరచడానికిగాను, బహిష్కృతపక్షమైన కాంగ్రెసుతోసహా, వివిధరాజకీయపక్షాల ప్రతినిధులతో సంప్రతింపులు ప్రారంభించేటట్లు చేసింది.

ఈ విజయా లెలా సాధ్యమయాయి ?

కాంగ్రెసు మొదటినుంచి ప్రశంసనీయములైన ఉదారాశయాలతో పనిచేస్తూన్నందువలన, కార్యాచరణలో స్వల్పవిషయాలనుకూడ శ్రద్ధగా పరిశీలించి నిర్ణయించుకొనుచుండుటవలన ఈ విజయములను సాధింపగలిగింది. ఈ దేశంలో నివసించే బ్రిటీషువారు బహుకొద్దిమంది. మొన్న మొన్నటివరకు 1200 మంది ఉండేవారు; ఇప్పుడు వారిలో సగముమందిమాత్రమే యూరపియనులు. వీరుగాక 61,000 మంది బ్రిటిషుసైనికులతోకూడిన ఆక్రమణపటాలంఒకటిఉంది. ఈ కొద్దిమందితోనే వారీ దేశాన్ని పాలింపగలుగుతున్నారు. దీనికి కారణం కొంతవరకు, వారు ఈ దేశంలో సాధించిన మానసిక విజయమే అయినా అసలు, దేశంలో మూలమూలలా వ్యాపించి పాతుకొని పోయిఉన్న ప్రభుత్వసంస్థే దీనికి ముఖ్యకారణం. భారత కార్యదర్శి ఆజ్ఞలు కేబులు ద్వారా రాజప్రతినిధికి అందజేయబడతాయి; తరువాత

తంతులద్వారా గవర్నర్లందరికీ అందుతాయి; వారు వాటిని కలెక్టర్లకు పంపుతారు; వారు వారిక్రింద పనిచేసే ఉద్యోగులందరికీ తెలియజేస్తారు, ఇలా ఒకవారం రోజులలో ప్రతి ఆజ్ఞ గ్రామగ్రామానికీ చేరిపోతుంది; వెంటనే ఈ ఆజ్ఞలు అమలు చేయబడతాయి:—బ్రిటిషు ప్రభుత్వం పరిపాలిస్తున్నది అని చెపుతున్నాం. మనం స్వాతంత్ర్యాన్ని స్థాపింపదలచుకొన్నప్పుడు మనముకూడ తత్తుల్యమైన సంస్థను నిర్మించుకొనగలిగినప్పుడే అది సాధ్యపడుతుంది. కాంగ్రెసు ఆజ్ఞాలుకూడ, మన అనధికార భారత కార్యదర్శి అయిన గాంధి నుంచి మన గవర్నరు జెనరల్ అయిన కాంగ్రెసు అధ్యక్షునకు; ఆయన వద్దనుండి రాష్ట్రగవర్నర్లవంటి వారైన రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాధ్యక్షులకు; వారి వద్దనుండి మండల కాంగ్రెసు సంఘాధ్యక్షులకు; వారినుండి క్రమంగా తాలూకా, ఫిర్కా, గ్రామ కాంగ్రెసు సంఘాలకు - అందచేయబడతాయి. అదేవిధంగా, క్రిందనుంచి కరణం మునసబుల నివేదికలూ రెవిన్యూ ఇనస్పెక్టర్లు, తాశీల్దారులు, డిప్యూటీ కలెక్టర్లు, కలెక్టర్లద్వారా బ్రిటిషుప్రభుత్వం క్రింద పనిచేసే గవర్నర్లకు చేరునట్లే, గ్రామకాంగ్రెసు సంఘాల వారి సూచనలుకూడా ఫిర్కా, జిల్లా, రాష్ట్రకాంగ్రెసు సంఘాలకు, చివరకు కాంగ్రెసు అధ్యక్షునికీ, ఆపైన అనధికార భారత కార్యదర్శి గాంధీమహాత్మునికి చేరుతాయి.

ఈ విధంగా కాంగ్రెసు 60 సంవత్సరాలనుండి ప్రభుత్వానికి ప్రతిసంస్థగా పనిచేస్తూ ప్రభుత్వశక్తులకు ప్రతిగా సర్వ జాతీయ శక్తులను సమీకరించి స్వరాజ్యసమరాన్ని ఈ 60 సంవత్సరాలు సాగించిన తరువాత 1945 లో బ్రిటిషుమంత్రి వర్గం భారతరాజ్యాంగ ప్రతిష్టంభనా పరిష్కారానికి మళ్ళీ కొన్ని నూతన సూచనలను చేయవలసి వచ్చింది.

సిమ్లా సమావేశానికి సంబంధించిన సంఘటనలన్నీ ఈ మధ్యనే జరిగినవి కావడం వల్లను, ప్రజలు వాటిని ఇంకా స్మరిస్తూనే ఉండటమువలన - తత్సంబంధములైన కొన్ని ముఖ్యవిషయాలనుగూర్చి మాత్రమే ఇక్కడ చెప్ప దగియున్నది. సిమ్లాసమావేశంలో కాంగ్రెసు పూర్తిగా సహకారం చేసిందని, చేసినా సమావేశం భగ్నంకావడం విచారింపదగినది అనీ వేవెలు ప్రభువు స్పష్టంగా అసందిగ్ధంగా అంగీకరించాడు. సమావేశం భగ్నంకావడానికి బాధ్యత జిన్నాదేననీ; కార్యవర్గనిర్మాణానికి ఆయన సభ్యుల పట్టికను సూచింప నిరాకరించిన మీదట వేవెలు స్వయంగా తయారుచేసిన జాబితాలో చేర్చబడిన ముస్లింలీగు సభ్యుల పేర్లనుకూడా జిన్నా అంగీకరించ లేదనీ - వేవెలుప్రభు వే జూలై 14 న తన ఉపసంహారకోపన్యాసంలో ప్రకటించాడు. లీగుమాత్రమే భారత ముసిములందరికీ ప్రాతినిధ్యం వహిస్తూ న్నట్లు భావించడానికి వేవెలు తన అసమ్మతిని వెల్లడించడం

యుక్తంగానే ఉన్నది. సిమ్లా సమావేశానికి కాంగ్రెసులో నుండి, లీగునుండి హాజరయిన ప్రతినిధులనుధ్య వైస్రాయి కార్యవర్గసభ్యుల పేర్లను సూచించే విషయంలో ఒడంబడిక కుదరక పోవడం దురదృష్టం. అది కుదిరి ఉన్నట్లయితే ఒక సంయుక్త ప్రణాళిక, భారత స్వాతంత్ర్య సాధనకు ఒక సక్రమ సంయుక్త కార్యవిధాన నిర్ణయం, బహుశః సత్వర భవిష్యత్తులోనే సంయుక్త నియోజకవర్గాలుకూడా సాధ్యమయేవి. జాతీయైక్యత, దాస్యవిమోచనను సాధించడానికి ఒక సంయుక్త కార్యక్రమం, మహత్తరమైన, అజయ్యమైన ఒక సంయుక్త మహోద్యమ ప్రయత్నం సాధ్యమయి ఉండేవి. కాని అది జరుగలేదు. వేరువేరుజాబితాల పద్ధతికూడా ఫలించలేదు. ఇది విఫలం అయిన తరువాత వేవెలు తాను తయారుచేసిన జాబితాలోని లీగు ప్రతినిధుల పేర్లను జిన్నాకు చూపక, పూర్తి జాబితాను కాంగ్రెసు అధ్యక్షునకు చూపించి ఉన్నట్లయితే అనేక కారణాలవలన బహుశః అది అనంగీకారముగా ఉండిఉండేది. అప్పుడు వేవెలు సిమ్లా సమావేశ వైఫల్యానికి బాధ్యతనంతా కాంగ్రెసుమీద వేయగలిగేవాడు. కాని ఆయన అలా చేయలేదు. బాధ్యత తను తనమీదనే వేసుకొని, సిమ్లా సమావేశానంతరం 1945 ఆగస్టు 2 వ తేదీన గవర్నర్ల సమావేశం జరిపి వారితో సంప్రతించాడు.

ఈ లోగా ఇంగ్లండులో కొన్ని ముఖ్య సంఘటనలు జరిగాయి. చర్చిలు పట్టుదలగా 1945 జూలై 5-వ తేదీన కార్మికపక్షంవారు వద్దంటున్నా వినకుండా యెన్నికలు జరిపారు. ఆ యెన్నిక ఫలితాలు బ్రిటిషు కన్సర్వేటివ్ పక్షం వారిని నిశ్చేష్టితులను చేశాయి. 417 గురు కార్మికపక్ష సభ్యులు విజయంపొందారు. కన్సర్వేటివ్ పక్షశక్తి క్షీణించి 210మంది మాత్రం ఎన్నుకోబడ్డారు. చక్రవర్తి కార్మికపక్ష నాయకుడు అట్లీని పిలిచి మంత్రివర్గాన్ని యేర్పరచ మని కోరాడు. జూలై 27వ తేదీన మంత్రివర్గం ఏర్పాటయింది. గాంధితోను, కాంగ్రెసుతోను హోరాహోరీగా పోరాడిన చర్చిలు చివరకు తనకు యుక్తమైన ఫలితాన్ని పొందాడు. 1940 మే 10వ తేదీన ప్రధానమంత్రిగా ఆయన అధికారం లోకి వచ్చాడు; 1945 జూలై 27 న ఉద్యోగాన్నుంచి విరమించాడు. ఈ 5 సంవత్సరాల 2 నెలలలోను భారత జాతీయోద్యమాన్నీ, దాని నాయకుడు గాంధీని అణచివేయడానికి ఆయన చేయనిప్రయత్నంలేదు. తనను అణచివేస్తానన్న చర్చిల్ మాటను కూడా ఉదాహరిస్తూ, ఐనా మనము ఉభయ దేశాల క్షేమముకొరకు మీరునన్ను మీయిష్టమువచ్చినట్లు ఉపయోగించుకొనవచ్చును'' అంటూ గాంధీ మహాత్ముడు చర్చిల్‌కి వ్రాసిన సవినయపూర్వకమైన కడపటిలేఖ మహామంత్రంగా పనిచేసి చర్చిలుమంత్రికి పతనకారణమైనది.

మేము విజయం పొందినట్లయితే భారతకార్యదర్శి అనే ఉద్యోగాన్నే ఎత్తివేస్తామనీ, ఆయన కార్యాలయాన్ని అధినివేశ కార్యాలయంతో కలిపివేస్తామనీ కార్మికపక్షము వారు చేసిన ఎన్నిక వాగ్దానాలను వారెంతవరకు కొనసాగిస్తారో చూడవలసియున్నది.

కాంగ్రెసుసంస్థ స్థాపింపబడిన తరువాత 60 సంవత్సరములు గడిచిపోయాయి. ఈ 60 సంవత్సరాలలో కాంగ్రెసు "జాతీయపార్లమెంటుకు పునాదివేయడ" మనే తన 1885 నాటి ఆశయాన్ని చాలావరకు సాధింపగలిగింది. ఎవరో బిరుదులు దాల్చిన కొంతమంది ముస్లింశ్రీమంతులు భారతదేశాన్ని రెండు స్వతంత్రఖండాలుగా విభజించడానికి ప్రయత్నిస్తూ ఉన్నా, మొత్తంమీద కాంగ్రెసు భారతజాతీయైక్యమును చాలావరకు సాధింపగలిగిందనే చెప్పవచ్చును. ఈ అర్ధశతాబ్దమునుండి చేస్తూన్న ఆందోళనకు, నిర్మాణకార్యక్రమానికీ ఫలితమైన సిమ్లాసభలో తాత్కాలికప్రభుత్వవిషయంలోనే అయినప్పటికీ— కేంద్ర కార్యవర్గసభలో సగానికి సగము స్థానములుకోరిన ముస్లింలీగువారి వాంఛ పాకీస్థానువాదుల ఆంతర్యాన్ని కొంతవరకు వెల్లడి చేసింది. నేడు మనము, ఉత్తరమున మహోన్నతము లయిన హిమాలయ పర్వతాలతోను, మిగిలిన మూడు దిశలఅగాధము లైన సముద్రాలతోను ఆవరింపబడి, ఒకే చారిత్రక

సంప్రదాయమునకు వారసులమై, ఒకే విజ్ఞానజ్యోతిచే ప్రకాశవంతము చేయబడిన జీవితవిధానము కలవారమయి, ఒకే సర్వకారణమైన నాగరికత గలవారమై, ఒకే జాతీయ భాషను (హిందుస్థానీని) గుర్తించినవారమై, ఒకే రాజకీయ విధానముచే పాలింపబడుచున్న ప్రజలమైన మనము అఖండ భారతవర్షము యెట్లు సర్వతోముఖాభివృద్ధి పొందుచున్నది చూడగలుగుతున్నాం. ఈ 60 సంవత్సరాలుగా కాంగ్రెసు చేసిన కృషికిఫలితంగా మనము మన ఏకలక్ష్యము, ఏకాదర్శము ఐన దాస్యవిమోచనము కొరకు ఐకమత్యముతో పోరాడగలగడం సాధ్యమైంది. దాస్యవిమోచనానంతరం దేశముయొక్క భవిష్యత్తు యేమిటి అనే విషయం కూడా కాంగ్రెసుదృష్టిని చాలా పర్యాయములు ఆకర్షించింది.

స్వతంత్ర భారతదేశముయొక్క స్వరూప స్వభావములను గురించి, కాంగ్రెసుజన్మించిన దాదిగా యెన్నో రకములైన భావములు వెల్లడింపబడుతూ వచ్చాయి. మొట్టమొదట ఏవో కొన్ని రాజ్యాంగ సంస్కరణలు మాత్రమే అనీ, తరువాత అధినివేశ స్వాతంత్ర్యం అనీ, హోంరూలు అనీ, స్వరాజ్యమనీ, చివరకు సంపూర్ణ స్వాతంత్ర్యమనీ అనేక లక్ష్యాలు నిర్వచింపబడ్డాయి. ఈ రకమైన నిర్వచనాల్లో అత్యున్నతమైన దానివరకు వచ్చినట్లే మనం భావిస్తున్నాం. ఈ వివిధ నిర్వచనాలకు సమాధానాలుగా

ప్రభుత్వ పక్షం నుంచి ఎప్పటి కప్పుడు ప్రతి నిర్వచనాలు వస్తూనే ఉన్నాయి - మన సంస్కరణలకు ప్రతిగా వారు 'సుపరిపాలన' అన్నారు; మన 'హోంరూలు', వారి 'బాధ్యతాయుత ప్రభుత్వ' భావనకు కారణ మయింది; కాంగ్రెసు స్వరాజ్యం కోరితే వారు తమ రాజకీయ సంస్కరణలలో ఇమిడివున్న అధినివేశ ప్రతిపత్తి అన్నారు. చివరకు మనం సంపూర్ణ స్వాతంత్ర్యమే మన గమ్యస్థానమని ప్రకటిస్తే రాజప్రతినిధి 1940లో తన ఓరియంటల్ క్లబ్ ఉపన్యాసంలో ''వెస్టుమిన్‌స్టర్ చట్టములో నిర్వచింపబడిన అధినివేశప్రతిపత్తి'' అనే నూతన వాక్యాన్ని బయట పెట్టాడు; అటుతరువాత అమెరీ ''సామ్రాజ్య కూటములో ఐచ్ఛికమైన సమాన భాగస్వామ్యము'' ను గురించి ప్రసంగించాడు. 1940 ఆగస్టు 14 వ తేదీన తన ప్రఖ్యాత పార్లమెంటు ఉపన్యాసంలో అమెరీ తనంతట తానుగా ఈభావానికి మళ్ళీవచ్చాడు; ''ఇదివరకు అనేకసారులు నిర్వచింపబడిన అధినివేశ ప్రతిపత్తియొక్క లక్ష్యాన్ని గురించి నేనొక్క విషయం చెపుతున్నాను: దానికి నానిర్వచనం; 'అది బ్రిటిషుసామ్రాజ్యంలో ఐచ్ఛికమైన భాగస్వామ్యము' అని'' - అని అమెరీ ఆ ఉపన్యాసంలో చెప్పాడు. తరువాత తన నిర్వచనాన్ని మళ్ళీ వ్యాఖ్యానిస్తూ - ''అధినివేశ ప్రతిపత్తిని సంపూర్ణ స్వాతంత్ర్యంతో పోల్చి చాలామంది

తరచు వ్యాఖ్యానిస్తూనట్టు అది స్వాతంత్ర్యంకంటె ఏమా త్రము తక్కువైనదిగాని, ఏవిధమైన పారతంత్ర్య స్థితిగాని కాదు. బ్రిటిషు సామ్రాజ్యాంతర్గతములైన అధినివేశ దేశాలహోదా - ఆ మాటకు వచ్చిన, బ్రిటనుహోదా, (మనశక్తి అధికము కావచ్చుగాని మనహోదా వారి హోదాతో సమానమైనదే) - బలవంతముగా ఒంటరిగా ఉండిపోయిన ఇతర దేశాల హోదాకంటె గొప్పదనేమాట యథార్థం,'' అన్నాడు. చివరకు బ్రిటిషు సామ్రాజ్యంలో ఉండటానికిగాని విడిపోవటానికిగాని భారత దేశానికి హక్కు ఈయబడుతుంది అనే క్రిప్సుప్రకటన వచ్చింది.

ఇది నిర్వచన పరిణామముల చరిత్ర. దీనిని అధినివే శము అనే భావముయొక్క పరిణామంతోకూడా పోల్చి చూడవచ్చు. అధి నివేశము అనేభావం 1926లో మొదట వాడుకలోకి వచ్చింది. అప్పుడు అధినివేశ దేశమంటే - ''బ్రిటిషు సామ్రాజ్యము అనే ప్రజాస్వామ్య రాజ్యకూట ములో, ఏవిధమైన పరస్పర పారతంత్ర్యము లేక, అంత రంగిక వ్యవహారాలలో ఇతరుల ప్రమేయ మేమీ లేని స్వతంత్ర దేశముగాఉండి,తక్కిన సామ్రాజ్య దేశాలతోపాటు బ్రిటనుతోమైత్రి కలిపి వర్తించే స్వతంత్ర రాజ్యఖండము''- అని నిర్వచించారు. అయితే ఆనిర్వచనం చాలా ఇతర విష యాలను గురించి ఏమీ చెప్పలేదు. అందువల్ల అప్పుడు

ఒక సమావేశం జరుపడానికి ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఆ సంఘం 1929లో సమావేశమయి 1930లో నివేదికను తయారుచేసి యిచ్చింది. తత్పర్యవసానంగానే వెస్టుమిన్‌స్టరు చట్టం తయారుచేయబడింది. ఇలా ఒకవైపున కొన్నిమార్పులు జరుగుతూ ఉండగానే మరొకవంక ఐర్లండు దేశం మరొకత్రోవత్రొక్కి క్రమంగా ఆటంకాలన్నింటినీ తొలగించుకొని విడిపోయి, నామ మాత్రంగా కాకుండా, నిజమైన స్వాతంత్ర్యరాజ్యం (Free State) అయిపోయింది. ఐర్లెండు దీని నెలా సాధింపగలిగింది? దక్షిణాఫ్రికావారు తమ భూభాగానికి దక్షిణాఫ్రికా సమాఖ్య అనేపేరు పెట్టుకనీ, ఆస్ట్రేలియావారు కామన్‌వెల్తు అనే పేరు పెట్టుకుని పూర్తియైన స్వాతంత్ర్యాన్ని పొందడానికి ఇంకా యత్నిస్తూ ఉండగానే - ఐర్లండు మొట్టమొదట సెనేటును స్థాపించింది; తరువాత రాజమకుటముతో మైత్రిని (Oath of Allegiance ను) నిరాకరించింది; తదుపరి ప్రీవీకౌన్సిలుకు అప్పీల్లు పంపడం మానివేసింది; ఆ పైన రాజప్రతినిధి పదవినికూడా తొలగించి వేసుకుంది; చివరకు 30 సంవత్సరాలనుండి ఏటేట కడుతూన్న కప్పమును చెల్లించడం మాని వేసింది; తనకు ప్రత్యేకమైన పతాకాన్ని ఏర్పరచుకుంది; యుద్ధంతో నాకేమీ సంబంధంలేదని తాటస్థ్యం వహించింది; చివరకు జర్మనీ ఓడిపోగానే ప్రజాస్వామికమ

(Republic) గా ప్రకటించుకుంది. ఈ సత్యములన్నీ ఇదివరకు అనేకమార్లు ఏకరువు పెట్టబడినవే కాని, ప్రస్తుతం భారతదేశ లక్ష్యమునుగూర్చిన ఒక నూతన నిర్వచన నినాదం మరల ఇప్పుడు సృష్టింపబడిందిగనుక మరొకమారు వీటిని స్మరింపవలసివచ్చింది. కాని భారతదేశం తనఅవసర లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యమే నని స్పష్టంగా ఇదివరకే వెల్లడించి వేసింది.

ఇప్పుడు ఈ 'ఐచ్ఛికమైన సమాన భాగస్వామ్యం' అనే ఈ నూతన నినాదము, ఈ వ్యాఖ్యానము, మనకు, ప్రతి దేశమునకు జన్మహక్కయిన సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదింపగలదో లేదో మనం విచారించుకోనవలసి ఉన్నది. అమెరీ భావనలో కెనడా, ఆస్ట్రేలియాలవంటి అధినివేశాలు, శక్తిలో గాకపోయినా, హోదాలో బ్రిటనుతో సమానమైనవే కావచ్చు. అందువలన భారతదేశం కూడా అలాగే బ్రిటనుతో సమానమైన హోదా కలిగి ఉంటుందని ఆయన వాదించనూ వచ్చును. కాని ఆయన భారత దేశముమెడకు చుట్టదలచుకొన్న భాగస్వామ్యం (Partnership) వలన ఆయన చెప్పేది ఏదీ చేతలలో కనుపించడంలేదు. భారతదేశం స్వాతంత్ర్యాన్ని వాంఛిస్తూందంటే,—తాను తనకు ఇష్టమైతే అంగీకరింపబోయే భాగస్వామ్యానికంటె ముందుగానే ఆస్వాతంత్ర్యం ఆమెకు

లభించాలి. అట్టి అంతర్జాతీయ బాంధవ్యాలు తనకు కిట్టవు అని కాంగ్రెసు ఎన్నడు చెప్పి ఉండలేదు. కనుక భారత దేశం "ఐచ్ఛికమైన" భాగస్వామినిగా ఉండాలంటే— ముందుగా భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యంగల దేశంగా ప్రకటింపబడాలి. ఇదే 1942 ఆగస్టు తీర్మానం లోను కోరబడింది. పదచిత్రాల గారడీవల్ల స్వాతంత్ర్యం సృష్టికాదు. ముఖ్యంగా, వెంటనే బ్రిటను భారతస్వాతం త్ర్యాన్ని ప్రకటించాలి అని కాంగ్రెసు కోరుతూంది. అది జరిగినతరువాత-భాగస్వామ్యమే అనండి, మరొకటి అనండి- దేనినిగురించిఅయినా చర్చించుకోనవచ్చు. ముఖ్యమైన దేమిటంటే-భారత దేశం ఏపనిచేసినా సంపూర్ణంగా, స్వేచ్ఛగా, తన కండ్లతో కంటూ, తనవీనులతో వింటూ,- ఆమెకు సంబంధంలేని వెనుకటి జవాబుదారీలకు వేటికీ కట్టు బడవలసిన నిర్బంధాలుగాని, భవిష్యత్తుకు ముందుగా హామీ నీయవలసిన అవసరాలుగాని లేకుండా-స్వయంగా చేసు కోవాలి, అనేదిమాత్రం చాలా అవసరం. అయితే ఒకటి మాత్రం నిజం-భారత దేశం ఇటుపై నిర్మింపబడే, ఉదారా శయపూరితమైన ఏ నూతనాంతర్జాతీయ వ్యవస్థలోనైనాసరే సంతోషంతో పాల్గొంటుంది.

# జాతీయ జ్ఞానమందిరము ఆశయములు



1. జాతీయ పునరుజ్జీవన కరములైన సర్వ శాస్త్ర రాజకీయ, సారస్వత, వైజ్ఞానిక శాఖలలో ప్రత్యేకాధికారముగల విద్వాంసులచే వివిధ విషయములపై తేట తెలుగులో గ్రంథములు వ్రాయించి, ప్రజాసామాన్యమునకు అందుబాటులో నుండులాగున ప్రకటించుట,

2. ఇతర భాషలయందలి ఉత్తమ గ్రంథములను ప్రవీణులచే తెనుగుచేయించి ప్రకటించుట,

3. ఉత్తమ గ్రంథములు రచించిన ఇతర గ్రంథకర్తలకు ఉచిత పారితోషికములిచ్చి వాటిని ప్రకటించుట,

4. ప్రజాసామాన్యములో జాతీయ విజ్ఞానాభివృద్ధికి, సర్వతోముఖ జాతీయ వికాసమునకు సహాయపడుట.

B. N. K. Press, Madras. Q. H. No. 405/D—2000 Copies. Dec. '45.

విశాలాంధ్ర పబ్లిషర్సు

వారి

# ఆంధ్ర వీరాంగనలు

రచయిత

శ్రీ మాగంటి బాపినీడు

పూర్వ ఆధునిక ఆంధ్రనారీమణుల చరిత్ర

భారత వీరాంగనల సంక్షిప్త చరిత్ర

చిత్రములతో సహా

అచ్చులో నున్నది.